

*7-11-1955 తేదీన సహకారి వారోత్సవాల సందర్భంలో హైదరాబాదు నగరంలో తీయబడిన ఊరేగింపు.*



*1955 అక్టోబరు 8 వ తేదీన బేగంపేట నం. 1 వైమానికదళ శిక్షణాలయంలో 66 నం. పైలట్సు కోర్సువారు దిప్యూటీ చీఫ్ ఆఫ్ ఎయిర్‌స్టాఫ్ ఎయిర్‌వైస్‌మార్షల్ ఎ. యం. ఇంజనీర్ డి. యస్. సి. గారికి [illegible]*

# విషయ సూచిక



ముఖచిత్రం :

ఖమ్మం జిల్లాలో అమలులోకి తేబడిన భూసంస్కరణల ఫలితంగా మేలుపొందిన వేలాది సేద్యదారులలో ఈయన ఒకరు.

వెనుకకవరు :

నవంబరు 1 వ తేదీన ఖమ్మంజిల్లాలో భూసంస్కరణలు అమలులోకి తేబడినవి. ఆ సందర్భంలో కౌల్దార్ల ఊరేగింపు దృశ్యం.


హైద్రాబాదు సమాచార పౌరసంబంధముల శాఖచే ప్రచురింపబడి, అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# ఖమ్మం జిల్లాలో దున్నేవారికే భూమి

## రాష్ట్రంలోని కౌలుదార్లకు సహకారంభం

## భూమిలేని రైతులకు మిగులు భూములు పంపిణీ



దున్నేవారికే భూమి అనే విధానం సమగ్రంగా ఖమ్మం జిల్లాలో ౧౯౫౫ నవంబరు ౧వ తేదీనుంచి అమలు జరుపబడడంతో ఒక్క భారతదేశంలోనే గాక యావత్తు ఆసియా ఖండంలో భూసంస్కరణల విషయంలో నవశకం ఆరంభమయింది. ఆ తేదీ నుంచి ఖమ్మం జిల్లాలో ౭౧౧౨ మంది రక్షిత కౌలుదార్లు తాము చిరకాలంగా సేద్యం చేసుకుంటూ వస్తూవున్న భూమికి యజమానులయినారు. అంతేగాక ౩, ౭౦౭ మంది సాధారణ కౌలుదార్లు తమకౌళ్ల విషయంలో మరికొన్ని హామీలు పొంది రక్షిత కౌలుదార్లు అయినారు. మిగులు భూములున్నటువంటి ౩౧౬ మంది భూకామందుల వద్ద నుంచి వారి మిగులు భూములను తీసుకొని భూమి లేని రైతులకు పంపిణీచేయడం జరుగుతున్నది. భూమిని దున్నేవారికి రక్షణ, గౌరవం, సాంఘిక ప్రతిపత్తి లభింపజేయునట్టి ఈ భూసంస్కరణల కార్యక్రమం త్వరలో రాష్ట్రంలోని మిగతా జిల్లాలన్నింటికి కూడా వర్తింపజేయబడుతుంది.

౧౯౫౦ సంవత్సరపు హైదరాబాదు కౌలుదారీ వ్యవసాయక భూముల చట్టం ఆమోదింపబడడంతో హైదరాబాదులో తీవ్రమైన భూసంస్కరణలకు నాందీ ప్రస్తావన జరిగింది. ఈ చట్టాన్ని అనుసరించి కొన్ని షరతులను పూర్తిచేయునట్టి కౌలుదార్లు రక్షిత కౌలు దార్లుగా పరిగణింపబడుతారు. వారికి కౌళ్ల విషయంలో పూర్తి రక్షణ లభిస్తుంది. అంతేగాక తాము సేద్యం చేస్తున్న భూమిని కొనుక్కుంటామని అడిగే హక్కు కూడా వారికి వున్నది. అయితే ౧౯౫౦ సంవత్సరం తరువాత ఏర్పడిన కౌళ్లకు ఈ హక్కులు లభింపవు. ౧౯౫౪ సంవత్సరంలో మిగులు భూములున్న భూకామందుల వద్ద నుంచి భూములను కౌలుకు తీసుకొని సేద్యం చేస్తున్న కౌలుదార్లలో చాలా మందికి శాసన బద్ధమైన రక్షణ లేదని గమనింపబడింది. కనుకనే ౧౯౫౦ సంవత్సరపు చట్టానికి రాష్ట్ర శాసనసభ అతి ముఖ్యమైన సవరణ నొకదానిని చేసింది. ఆ సవరణ (౩౮–ఎ సెక్షన్) ప్రకారం మూడు కుటుంబ కమతాల ప్రమాణానికంటె ఎక్కువగా భూమి వున్న భూయజమానుల తాలూకు సాధారణ కౌలుదార్లు రక్షిత కౌలుదార్లుగా ప్రకటింపబడతారు. ఈ కౌలుదార్లు అందరూ భూకామందుల వద్దనుంచి భూముల్ని కొనే హక్కును పొందినవారవడమేగాక ప్రభుత్వం తలపెట్టిన యాజమాన్య హక్కుల నిర్బంధ పూర్వక మార్పిడి పథకాన్ని అనుసరించి భూములపై స్వామ్యాన్ని పొందే హక్కును కూడా కలిగిన వారవుతారు. ఒక్క ఖమ్మం జిల్లాలోనే ఈ విధంగా ౩, ౭౦౭ మంది సాధారణ కౌలుదార్లు రక్షిత కౌలుదార్లుగా ప్రకటింపబడుతున్నారు. రాష్ట్రం మొత్తంలో ఈ శాసనంవల్ల లాభం పొందే కౌల్దార్ల సంఖ్య ఒకటిన్నర లక్షలు ఉంటుంది.

### యాజమాన్యం మార్పిడి

రక్షిత కౌలుదారు భూకామందుకు భూమిపైగల యాజమాన్య హక్కును సమంజసమైన ధరకు కొనుక్కునే హక్కు కలిగి వున్నాడు. చట్టంలోని ౩౮ వ సెక్షన్ ప్రకారం ఈ విధంగా భూమిని కొనుక్కోవడానికి రక్షిత కౌలుదారు భూకామందుకు నోటీసు ఇవ్వవలసి వుంటుంది అయితే చాలా కొద్దిమంది రక్షిత కౌలుదార్లు మాత్రమే ఈ హక్కువల్ల లాభం పొందడానికి ముందుకొచ్చారు. గత మూడేండ్లలో ౧౧, ౬౪౦ మంది రక్షిత కౌలుదార్లు మాత్రమే ౧, ౨౬, ౮౨౫ ఎకరాల భూమిని కొనుక్కోగలిగినారు. ఇటువంటి అమ్మకాలలో ఎక్కువ భాగం భూకామందుల ఇష్టం ప్రకారమే జరిగినవి. కాని సమంజసమైన ధరకు మాత్రమే భూమిని కొనుక్కుంటామని రక్షిత కౌల్దార్లు గట్టిగా పట్టుబట్టలేదు. పైగా మార్కెటు రేట్లప్రకారం కొనుక్కున్నారు. అంతేగాక కొన్ని సందర్భాలలో భూస్వాముల ప్రాబల్యానికి లొంగిపోయి భూములపై తమకుగల హక్కులను చేతులారా వదులుకున్నారు. కనుక రక్షిత కౌల్దార్ల పరిస్థితిని బలపరిచి, వారికి సత్వరం భూమి మార్పిడి జరిగేటట్లు చేయడానికై ప్రభుత్వం చట్టంలోని ౩౭ (ఇ) సెక్షనును అమలు పరచడానికి నిర్ణయించింది. దీన్ని అమలుపరచడమంటే కొన్ని షరతులకు లోబడి రక్షిత కౌల్దార్లకు భూమిపై యాజమాన్య హక్కులను నిర్బంధంగా సంక్రమింప చేయడమన్నమాట. భూకామందులకు కుటుంబ కమతం ప్రమాణానికి రెండు రెట్లకంటె ఎక్కువ భూమివున్న సందర్భాలలోనే ఇట్లా నిర్బంధంగా స్వామ్యం సంక్ర



*భూసంస్కరణల దినోత్సవసందర్భంలో ఖమ్మంలో జరిగిన బహిరంగసభలో జిల్లాకలెక్టరు ప్రసంగిస్తున్నారు.*

మింప చేయబడుతుంది. ఈ విధంగా ప్రతి భూకామందుకు ఆ ప్రాంతంలో నిర్ణయింపబడిన కుటుంబ కమతం ప్రమాణానికి కనీసం రెండు రెట్ల భూమి అతడి స్వంత సేద్యం కొరకు గాని లేక మరోవిధంగా సేద్యం చేయించుకోవడానికిగాని వదిలివేయబడు తుంది. రెండవ షరతు ఏమంటే రక్షిత కౌలుదారును ఒక కుటుంబ కమతం ప్రమాణాని కంటె హెచ్చు భూమికి యజమానిగా చేయడం జరుగదు. ఈవిధంగా అటు భూకామందుకూ, ఇటు కౌలు దారుకూ న్యాయం చేకూర్చబడింది. ఇటువంటి సంస్కరణలు ఖమ్మం జిల్లాలో అమలు జరుపబడుతున్నవి. త్వరలో ఇతర జిల్లా లలో కూడా అమలు జరుపబడుతాయి.

## సమంజసమైన ధర

ఈ యాజమాన్యం మార్పిడి వ్యవహారంలో రక్షిత కౌల్దార్లకు సాధ్యమైనన్ని సౌకర్యాలు కల్పించబడుతాయి. కౌలుదార్లు సేద్యం చేస్తున్న భూమిపై వారికి ఇదివరకే మాటికి ౬౦ వంతుల యాజమాన్యం కలదనీ, ఇక పోతే మిగిలిన ౪౦ వంతుల యాజమాన్య హక్కును మాత్రమే వారు భూకామందులవద్ద నుంచి ధర ఇచ్చి కొనుక్కోవలసి వున్నదనీ ఈ చట్టంలో భావించబడింది. రక్షిత కౌల్దారు చెల్లించవలసిన సమంజసమైన ధర భూమి శిస్తునుబట్టి నిర్ణయించబడింది. ఏరక్షిత కౌల్దారుడైనా భూమిని కొనడానికి చెల్లించవలసిన ధర చెలక భూమి అయితే ఖుష్కీ శిస్తుకు ౬౦ రెట్లకు మించి, నల్లరేగడి భూమి అయితే ఖుష్కీ శిస్తుకు ౭౫ రెట్లకు మించి, బావుల క్రింద లేక ఇతర జలాధారముల వల్ల సేద్యం చేయబడే భూమి అయితే తరి శిస్తుకు ౨౪ రెట్లకు మించి ఉండరాదని నిర్ణయించబడింది.

## చిన్న చిన్న కిస్తులు

రక్షిత కౌల్దారు కొనుక్కునే భూమి ధరను చిన్న చిన్న కిస్తు లలో ఎనిమిదేండ్ల లోపుగా చెల్లించవచ్చును. కిస్తుల సంఖ్యను ట్రిబ్యూనల్ నిర్ణయిస్తుంది. రక్షిత కౌల్దారు ఎనిమిదేండ్ల లోపున భూమి ధరను చెల్లిస్తానని అంగీకరిస్తే చాలు. అతడు ఆ భూమికి తత్‌క్షణమే యజమాని అవుతాడు. ప్రతి యేటా చెల్లించవలసిన కిస్తు

అతను అంతకు పూర్వం భూకామందుకు చెల్లిస్తూ వచ్చిన సమంజసమైన కౌలు సొమ్ముకు సమానంగా నైనా ఉంటుంది. లేదా ఇంకా తక్కువగానే వుండవచ్చు. ఏమైనా అతడు రివాజుగా చెల్లిస్తూ వచ్చిన కౌలు సొమ్ము కంటె ఈ కిస్తు తక్కువగానే ఉంటుందని నిశ్చయంగా చెప్పవచ్చు.

భూమి కొనుక్కోడానికి ఆర్థికస్తోమతు లేనట్టి రక్షిత కౌల్దార్లకు భూమి తనఖా బ్యాంకుద్వారా సహాయం చేయబడుతుంది. కౌలుదారు తరపున బ్యాంకువారే ప్రతియేటా కిస్తులను చెల్లించి ఆ అప్పును ౧౬ మొదలు ౨౦ ఏండ్లలోపుగా రాబట్టుకుంటారు.

## ఖర్చుల తగ్గుదల

భూమికొనుక్కునే సందర్భంలో కౌల్దారు మారకం దస్తావేజు వగైరాలను రిజిష్టరు చేయించుకోడానికి ఖర్చు పడనక్కరలేదు. ఎందుచేతనంటే యాజమాన్యం మార్పిడి ప్రభుత్వాధికారం క్రింద అమలు జరుపబడుతుంది. కౌలుదారుకు సర్టిఫికెటు ఇవ్వబడుతుంది. ఆసర్టిఫికెటు లభించిందంటే ఇతర వ్యక్తులందరికి బదులుగా అతనే ఆ భూమికి యజమాని అయినట్లు ధృవపడుతుంది. ఈవిధంగా కౌల్దారుకు వ్యయ ప్రయాసలు తప్పుతాయి.

ప్రస్తుత భూసంస్కరణలో మూడవదశ కమతాలకు గరిష్ఠ పరిమితులను నిర్ణయించడం, సాంఘిక న్యాయం ఒనగూర్చి గ్రామ ప్రాంతాలలో భూములులేని వ్యక్తులకు హెచ్చుగా పనులు కల్పించడానికి ఇకముందు భూముల సముపార్జనపై పరిమితిని విధించడమే గాక ప్రస్తుతం వున్నట్టి కమతాలపై కూడా గరిష్ఠ పరిమితిని విధించవలెను. గరిష్ఠ పరిమితి అంటే ౪న్నర కుటుంబకమతాల ప్రమాణమని నిర్ణయించబడింది. కుటుంబ కమతమంటే ఏస్థానిక ప్రాంతంలోనైనా ఏడాదికి రు. ౧౬౦౦ ల విలువచేసే ఉత్పత్తిని ఇచ్చునట్టి భూ ప్రమాణమని నిర్వచింప బడింది. ఇటువంటి కుటుంబ కమతం ప్రమాణాలు రాష్ట్రంలోని వివిధ స్థానిక ప్రాంతాలలో నిర్ణయించబడి, ప్రకటింప బడినవి. గరిష్ఠ పరిమితులు ఎకరాలుగానే నిర్ణయింప బడినవి. అందుచేతనే వివిధ స్థానిక ప్రాంతాలలో నికరంగా ఎకరాలను తేల్చి నిర్ణయించ వలసి వచ్చింది. ఇందుకొరకై రు. ౧౬౦౦ ల విలువచేసే మొత్తం ఉత్పత్తిలో వచ్చే నికరాదాయమే ప్రమాణంగా తీసుకోబడింది. ఈ ఎకరాల ప్రమాణం ఖుష్కి భూముల విషయంలో ౨౬ మొదలు ౬౦ ఎకరాల వరకు, తరీ భూముల విషయంలో ౬ మొదలు ౯ ఎకరాల వరకు కలదు.



భూసంస్కరణల దినోత్సవసందర్భంలో ఖమ్మంజిల్లా తల్లంపాడుగ్రామంలో జరిగినసభ.



*పాలేరు గ్రామస్థులు భూసంస్కరణలవల్ల కలిగే లాభాలను శ్రద్ధగా తెలుసుకుంటున్నారు.*

మిగులు భూములున్న భూకామందులలో ఒక్కొక్కరికి ఎంత భూమి ఉన్నదీ, అది ఎక్కడెక్కడ ఉన్నదీ, ఎటువంటి భూమి అయినదీ తెలుసుకోవడం అవసరమయింది. ఇందుకోసం భూముల లెక్కలు సేకరింప బడినవి. ఈ లెక్కలను బట్టి రాష్ట్రంలో మిగులుభూమి ఉన్న భూస్వాములు ౧౮౦౦౦ మంది ఉన్నట్లు, వారికి ౭౫ లక్షల ఎకరాలు భూమి ఉన్నట్లు తెలియ వచ్చినవి. ఇందులోనుంచి ౪౦ లక్షల ఎకరాలభూమి యొక్క యాజమాన్యం కౌల్దార్లకు మార్పుచేయ బడుతుంది. ౩౫ లక్షల ఎకరాలు భూకామందులకు వారి సొంత సేద్యం కొరకు వుంచబడుతుంది. మిగిలిన ౧౦ లక్షల ఎకరాల భూమిని ప్రభుత్వం స్వాధీన పరచుకొని భూములులేని వ్యక్తులకు పంపిణీచేస్తుంది. ఖమ్మం జిల్లాలో మిగులు భూములున్న భూకామందుల సంఖ్య ౬౧౨. వారివద్దనుంచి ౭౮,౯౩౬ ఎకరాల భూమి స్వాధీన పరచుకో బడుతుంది.

మిగులు భూములపై మేనేజిమెంటును ప్రభుత్వమే వహించి వాటిని భూములులేని వ్యక్తులకు సేద్యం చేసుకోడానికి కౌలుకు ఇస్తుంది. అట్టి సందర్భంలో భూకామందులకు ఏటా కౌలుసొమ్ము రూపంలో పరిహార మివ్వబడుతుంది. లేదా ఆ భూములను ప్రభుత్వం స్వాధీన పరచుకొని భూములులేని వ్యక్తులకు శాశ్వతంగా ఇచ్చివేస్తుంది. ఇట్టి సందర్భంలో భూకామందులకు సమంజసమైన ధర చెల్లించడ మవుతుంది. ఆ విధంగా చెల్లించే ధర కౌలుసొమ్ముకు ౩౦ రెట్లకు మించకుండా వుంటుంది. పరిహారాన్ని మొత్తంగా గాని లేక కొంత భాగంగాగాని చెల్లించుటకు ప్రభుత్వం బాండులను కూడా జారీచేయవచ్చు. భూములకు చెల్లించవలసిన ధరను వాటిని ఎవరికైతే పంపిణీ చేయడం జరుగుతుందో వారినుంచి కూడా వసూలు చేయబడవచ్చు.

భూములను ఇచ్చే విషయంలో ప్రాధాన్యం క్రమం ఇది- సహకార వ్యవసాయ క్షేత్రాలు, మిగులు భూములపై పనిచేసే వ్యవసాయ కూలీలు, కుటుంబ కమతం ప్రమాణానికంటె తక్కువ భూమిగల రైతులు, కౌల్దార్లు, గ్రామంలో భూములులేని ఇతర వ్యక్తులు.

మిగులు భూముల వ్యవహారాన్ని పరిష్కరించే విషయంలో గ్రామ కమిటీలను సంప్రదించడం జరుగుతుంది.

## ఖమ్మం జిల్లాలో జరిగేపని

ఖమ్మం జిల్లాలో ౬౦,౦౦౦ ఎకరాల భూమిపై యాజమాన్యం రక్షిత కౌలుదార్లకు దఖలు పరచ బడింది. భూకామందులవద్దనుంచి స్వాధీన పరుచుకోబడిన మిగులు భూమి భూములు లేనట్టి దాదాపు ౫౦౦౦ కుటుంబాలకు పంపిణీచేయబడుతుంది. ఈ విధంగా రక్షిత కౌల్దార్లకు భూముల అమ్మకం, మిగులు భూముల పంపిణీ పని ముగిసిన తరువాత ఏ భూస్వామికి కూడా కుటుంబ పరిమితం ప్రమాణానికి ౪న్నర రెట్లకు మించిన భూమి ఉండదు.

ఈ భూసంస్కరణల కార్యక్రమం ఆరంభమైన నవంబరు ౧వ తేదీన ఖమ్మం జిల్లాలోని అన్ని గ్రామాలలోను అసింహో త్సాహాలతో ఉత్సవాలు, సభలు, సమావేశాలు జరుపబడినవి. ౧౯౫౩-౫౪ సంవత్సరపు భూముల లెక్కల రికార్డులు ప్రాతిపది కగా చట్టంయొక్క ౩౭ (ఎ), ౩౮ (బి) సెక్షనుల ననుసరించి తాత్కాలిక జాబితాలు తయారుచేయబడినవి. ఈ జాబితాలు గ్రామా లలో ప్రకటింపబడుతున్నవి. వాటికి అభ్యంతరం తెలుపదలచిన వారికి నెల రోజుల గడువు ఇవ్వబడింది. ఈ అభ్యంతరాలను ట్రిబ్యునల్సు విచారణచేసి పరిష్కరిస్తాయి. అట్టి ట్రిబ్యునల్సు లేకపోయినట్లయితే డిప్యూటీ కలెక్టర్లు ఆ విధులను నిర్వర్తిస్తారు.

తాత్కాలిక జాబితాలు తీసుకొని నాయబ్ తహశీల్దార్లు గ్రామా లకు వెళ్ళి అక్కడి కక్కడే విచారణలు జరిపి, ఆ జాబితాలలో అవసరమైన సవరణలు చేసి వాటిని సమగ్రంగా తయారు చేస్తు న్నారు. నాయబ్ తహశీల్దార్ల చేస్తూవున్న పనిని పర్యవేక్షించ డానికి దాదాపు ౧౧ మంది గజెటెడ్ ఉద్యోగులు నియమింప బడినారు.

ఒక్కొక్క సర్కిలుకు ఒక నాయబ్ తహశీల్దారు, ఒక డివి జనుకు అదనంగా ఒక డిప్యూటీ కలెక్టరు, జిల్లాకు ఒక డిప్యూటీ భూసంస్కరణల అధికారి నియమింప బడినారు. మొత్తం ౩౨ మంది నాయబ్ తహశీల్దార్లు, ఇద్దరు అడిషనల్ డిప్యూటీ కలెక్టర్లు



నేలకొండపల్లిసభలో వక్తల ఉపన్యాసాలను కౌల్దార్లు శ్రద్ధగా వింటున్నారు.

ఈ పనిలో నిమగ్నమై వున్నారు. ఈ సిబ్బంది నిర్వహణకు నెలకు దాదాపు రు. ౧౫,౦౦౦ లు ఖర్చు అవుతుంది.

తాత్కాలిక జాబితాలకు అంతిమ స్వరూప మిచ్చిన తరువాత రక్షిత కౌల్దార్లకు భూములను స్వాధీపరచడం, మిగులు భూములను స్వాధీన పరచుకొని భూములు లేనివారికి పంపిణీ చేయడం- ఇదంతా ౧౯౫౭ ఫిబ్రవరి వరకు పూర్తి అవుతుంది.

## ఉత్సవాలు

౧౯౫౫ నవంబరు ౧ తేదీన ఖమ్మంజిల్లాలోని గ్రామాలు భూసంస్కరణల దినోత్సవాన్ని కడువైభవంగా జరిపాయి. ఆనాడు ప్రభాత ఫేరీలు, ఊరేగింపులు తీయబడినవి. సభలు ఏర్పాటు చేయబడినవి. గ్రామాలు ఆర్చీలతోను, చిత్రపటములతోను చక్కగా అలంకరించబడినవి. "రాజుల రోజులు పొయ్యాయి. ప్రజాయుగం వచ్చింది. దున్నేవాడే భూమికి యజమాని" అనే నినాదాలు సభలలో మార్మోగినవి.

ఇటువంటి భూసంస్కరణలు అమలు జరిపినందుకుగాను తమ కృతజ్ఞతలు తెలియపరుస్తూ మధిర తాలూకా కౌల్దార్లు ముఖ్యమంత్రికి టెలిగ్రాములు పంపారు.

మధిరలో శ్రీ కె. శేషగిరిరావు అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. తహసీల్దారు శ్రీ యం. యస్. నెమావంత్ భూసంస్కరణల పథకంలోని ముఖ్యాంశాలను వివరిస్తూ ప్రసంగించారు. సభలో శ్రీ మిర్యాల నారాయణగుప్త, ప్రతాపరెడ్డి, గుర్రం వెంకటేశ్వర్లు, పురుషోత్తమరావుగారలు కూడా ఉపన్యసించారు.

ఖమ్మంలో గొప్ప బహిరంగసభ జరిగింది. ౪ వేలమంది కౌల్దార్లు హాజరైన ఈ సభకు భూసంస్కరణల కమటీ అధ్యక్షుడు శ్రీ యం. నరసింగరావుగారు అధ్యక్షత వహించారు. జిల్లాకలెక్టరు శ్రీ జి. వి. బట్ ఈ సంస్కరణలవల్ల ఖమ్మం జిల్లాలో ఎంత భూమి పంపిణీ చేయబడుతుందో మొదలగు వివరాలను తెలిపారు. సభాధ్యక్షులు ప్రసంగిస్తూ తాత్కాలిక జాబితాలను వాటికి సంబంధించిన వారంతా శ్రద్ధగా సరిచూచుకొని ఎవరికీ అన్యాయం జరగకుండా చేసుకోవలెనని ఉద్బోధించారు. భూములను సంఘటిత పరచటానికి, సహకార వ్యవసాయ సంఘాలను నెలకొల్పటానికీ ప్రభుత్వం తగు చర్యలు గైకొనగలదని తామాశిస్తున్నట్లు వారు తెలియ జేశారు.

ఈ సభలోనే ఒక తీర్మానం ద్వారా రైతులు, భూములులేని ఇతర వ్యక్తులు చట్టాన్ని అనుసరించి భూములు కొనుక్కోవడానికై వారికి అప్పు ఇవ్వడానికి రు. ౧౦ లక్షలను ప్రభుత్వం మంజూరు చేయాలని కోరబడింది. పార్లమెంటు సభ్యుడు కె. ప్రసాదరావు, పర్సా శ్రీనివాసరావు, మాదిరాజు రామకృష్ణారావు, బొమ్మకంటి సత్యనారాయణరావు, కొలిపాక కిషన్‌రావుగారలు ఈ సభలో ప్రసంగించారు.

పాల్వంచలో జరిగిన బహిరంగ సభకు తహశీల్దారు శ్రీ శామ్యూల్ అధ్యక్షత వహించారు. దాదాపు వెయ్యిమంది కౌల్దార్లు సభలో పాల్గొన్నారు. శ్రీ వనం నరసింహారావు, శ్రీగులాం గౌస్ వకీలు మున్నగు వారలు ప్రసంగిస్తూ ఇంత త్వరగా భూసంస్కరణలను అమలు పరచినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తూ ఈ సంస్కరణలవల్ల కౌల్దార్లకు జరిగే లాభాలను వివరించారు. ఈ తాలూకాలో రక్షిత కౌల్దార్లుగా ప్రకటింపబడిన వారిలో సూటికి ౮౦ మంది హరిజనులు, లేదా నిమ్న తెగలవారై ఉన్నారు.

బూర్గంపాడులో ఒక జీపుకారును జాతీయనాయకుల పటాలతోను, ఇతర కరపత్రాలు చిత్రాలు మున్నగు వాటితోను అలంకరించి ౨ వేలమంది కౌల్దార్లు ఊరేగింపు తీశారు. ఆ తరువాత తహశీలు కార్యాలయంలో ఒక బహిరంగసభ జరిగింది. ★



నిజాం కళాశాలలో తెలుగు సారస్వత సమితి సభలో ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు



నేషనల్ కేడెట్ కోర్ ఉద్యోగులతో ముఖ్యమంత్రి సంభాషిస్తున్న దృశ్యం.

# సాలార్జంగ్ మ్యూజియం

డాక్టర్ గులాం యజ్దానీ

హైదరాబాదు రాష్ట్ర రాజకీయ వైజ్ఞానిక చరిత్రలో సాలార్జంగ్ వంశం సుప్రసిద్ధమైనది. ఈ వంశానికీ, సాలార్జంగ్ మ్యూజియానికీ సంబంధం కలదు. ఈ వంశంలో కట్టకడపటి వాడైన నవాబ్ మీర్ యూసుఫ్ అలీఖాన్ బహదుర్ తన జీవిత పర్యంతం సేకరించిన అమూల్య వస్తు సామగ్రినీ, తన కుటుంబ ధనాన్నీ చరాస్తినీ ఒక మ్యూజియం రూపంలో ఏర్పాటు చేయవలెననీ, అటువంటి మ్యూజియం విద్యార్థులకు, ప్రజలకు, కళాభిమానులకూ ప్రయోజనదాయకం కావలెననీ కాంక్షించాడు. అయితే ఆయన తన కోర్కె నెరవేరకుండానే అకస్మాత్తుగా ౧౯౪౯ లో మరణించాడు. కాని అప్పటి హైదరాబాదు ప్రభుత్వం ఆయన చిరకాల వాంఛ యొక్క విద్యా వైజ్ఞానిక ప్రాముఖ్యాన్ని గుర్తించి వివిధ భవనాలలో చెదిరివాటుగా వున్న ప్రాచీన సామగ్రిని. కళాఖండాలను. చిత్రవిచిత్ర వస్తువులను సేకరించి నగరంలోని ఆయన సౌధంలో ఒక ప్రదర్శనశాల ఏర్పాటు చేసింది.



చీనాదేశపు కంచు మరియు దంతపు బొమ్మలు.

ఆ సౌధం కూడా ప్రాచ్య పాశ్చాత్య శిల్ప సమ్మేళనంతో నిర్మింప బడింది. అట్టి మ్యూజియమునకు ప్రధాన మంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ ౧౯౫౧ డిసెంబరు ౧౬ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

సాలార్జంగ్ వంశం మిక్కిలి ఘనత వహించినది. ఆసఫ్ జాహీ రాజులు ఈ వంశం వారిలో అయిదుగురిని తమ ప్రధానమంత్రులుగా నియమించుకున్నారు. ఈ వంశీకులకు కళలయందు ప్రీతి మెండు. కనుకనే వారు అనేక ప్రాచ్య లిఖిత ప్రతులను, చైనా సామగ్రిని, రత్నఖచితమైన ఖడ్గములను, ఇటలీ విగ్రహాలను ఇంకా అనేకమైన వాటిని సేకరించ గలిగారు. సర్ సాలార్జంగ్ ౧౮౭౬ లో రోము నగరాన్ని సందర్శించినపుడు ప్రసిద్ధ శిల్పి బెన్‌జానీచే తయారు



మేలిముసుగుతోనున్న రాషేల్‌వనిత-శిల్పి: బెన్‌జానీ; కాలం, 1876.

చేయబడిన "మేలిముసుగు వేసుకున్న రాషేల్ వనిత" అను విగ్రహాన్ని కొని దానిని హైదరాబాదులోని తమ భవనంలో పెట్టుకున్నాడు. ఈ విగ్రహం ఇప్పటికీ సాలార్జంగ్ మ్యూజియంలో చెక్కుచెదరకుండా వున్నది. రాషేల్ వనిత శరీరం ఉడుపులతో ఉన్నట్లు, ఆమె మెడ, ముఖము ముసుగు లోపల వున్నట్లు చూపబడినప్పటికీ ఆమె యొక్క యౌవనాన్నీ అంగసౌష్ఠవాన్నీ ఆ శిల్పి అత్యద్భుతంగా అసమానంగా రూపొందించాడు. ఆ విగ్రహం చెక్కబడిన తీరు, దాని వైఖరిని చూస్తే ఆ స్త్రీ ఎంతటి లావణ్యవతియో, ఆమె అంగాలు ఎంత మృదువైనవో అవగతమవుతుంది. ఆమె కాలివ్రేళ్ళ కుదురు, ఉడుపుల చిత్రణ, మేలిముసుగు లాలిత్యం ఆ విగ్రహాన్ని నిర్మించిన శిల్పి యొక్క నైపుణ్యాన్నీ నాగరికమైన అతడి అభిరుచిని వ్యక్తీకరిస్తాయి. ఆ విగ్రహం ౧౯ వ శతాబ్దంలో చెక్కబడినప్పటికీ ఇప్పటికీ ఎంతో సజీవంగా వున్నది. నేత్ర పర్వమైన చక్కని అంగ విన్యాసాలతో ఆ విగ్రహం సాంప్రదాయిక యుగపు శిల్ప విన్నాణానికి తార్కాణంగా నిలిచి వున్నది.

సాలార్జంగ్ వంశం వారి కుటుంబ ఆస్తిలో కాంతి ప్రసరితమైన ఖురాను సంపుటములు. ఉత్తమ లేఖకులచే వ్రాయబడి ప్రపంచములోనే నిపుణులని పేర్వడసిన చిత్రకారుల చేత చిత్రములు వేయబడిన ప్రసిద్ధకవుల, రచయితల గ్రంథములు ప్రత్యేకంగా చెప్పుకోదగి వున్నవి. వీనిలో కొన్ని లిఖిత ప్రతులు అద్వితీయమైనవి. సాలార్జంగ్ వంశంవారికి సంక్రమించక మునుపు అవి ఏయే రాజుల గ్రంథాలయాలలో



భారతదేశపు దంతపు బొమ్మలు.



మెఫిస్టోఫెలిస్ - మార్గరెటా-ఇటలీదేశపు కొయ్య విగ్రహం.

ఉండెడివో ఆరాజుల చేవ్రాళ్లుకూడా వాటిపై వున్నవి. వాటిలో కొన్ని ఇవి — మీర్ అలీ అల్కాతిబ్ విరచితమైన రౌజతుల్ మొహిబ్బిన్, ఇమాద్ లేఖ్యము వ్యక్తపరిచే లావా హెజామీ, యాఖూత్ అల్ ముస్తాచే నస్థ శైలిలో వ్రాయబడిన ఖురాన్ గ్రంథం. వీనిలో రౌజతుల్ మొహిబ్బిన్ అనే గ్రంథం సచిత్రమైనది. ౧౬ వ శతాబ్దంలో బుఖారాకు చెందిన సుల్తాన్ అబ్దుల్ అజీజ్ ఖాన్ దర్బారులో ఆదరణము పొందినట్టి బిహజద్ అను చిత్రకారుడు రచించిన కొన్ని వర్ణ చిత్రములుకూడా పై గ్రంథంలో వున్నవి. ఈ లిఖిత ప్రతులలో కొన్ని చిత్రాలలో బంగారు రంగు పూర్వరంగంగా, పచ్చని చెట్ల సమూహంతో చూపబడిన గంభీరత అద్భుతంగా వున్నది. పారశీక వర్ణచిత్రాలు సాధారణంగా పరచినట్లుగా సమంగా ఉంటాయి. కాని ఈ చిత్రాలలో మనుష్యుల బొమ్మలు పైకి ఉబికి ఉన్నట్లుగా చిత్రింపబడినవి.

ఇక ప్రాచీన చీనాదేశపు సేకరణలలో — క్రీ. శ. ౧౦౦౦- ౧౩౦౦ - సూంగ్ మరియు మింగ్ కాలానికి చెందిన "గ్రీన్ సెలాడన్" మొదలుకొని - క్రీ. శ. ౧౩౦౦ - ౧౬౦౦ - మింగ్ మరియు కాంగ్-హె కాలానికి చెందిన "పర్షియన్ బ్లూ" "ఫేమిల్లీవెర్టే" వరకు కలవు. ౧౯ వ శతాబ్దంలోనో

౧౮ వ శతాబ్దారంభంలోనో చెంబర్లేన్ వార్సెస్టర్ ఫ్యాక్టరీలో సాలార్జంగ్ కుటుంబం కొరకు తయారు చేయబడిన చీనా సామగ్రికూడా ఈ ప్రదర్శన శాలలో చాలా వున్నవి. ఇందులోగల సెలాడన్ సేకరణ భారత దేశంలో కెల్లా, బహుశా ఆసియా ఖండంలోనే పెద్దదని చెప్పవలెను. మత సంకేతాలు, కళాత్మకమైన డిజైనులు, టింటులు, గ్లేజ్ టెక్నిక్ ఇవన్నీ ఈపరిశ్రమయొక్క పుట్టుపూర్వోత్తరాలను, అభివృద్ధిని గూర్చి పరిశోధన చేయువారికి ఎంతో ఉపయోగ పడతాయి.

ఈ మ్యూజియంలోవున్న ఆయుధాలలోకొన్ని, ముఖ్యంగా ఖడ్గములు ఒకప్పుడు భారత దేశములోని కొందరు పెద్ద పెద్ద మహారాజులచే ధరింపబడినట్టివని సాలార్జంగ్ వంశము వారివల్ల తెలియవస్తున్నది. ఈ విషయం నిజమైనా కాకపోయినా డెమాస్కస్ ఉక్కుతో తయారు చేయబడిన ఆ ఖడ్గములు, రత్న ఖచితములైన వాటి చేతిపిడులు చూచుట కెంతో ఘనంగా ఆకర్షణీయంగా కన్పిస్తాయి. భారత దేశ చరిత్రలో మధ్యయుగంలో రాజులు, మహారాజులు రత్నఖచితమైన పిడులను ఖడ్గములను చేయించెడి వారు. కనుక ఈ పరిశ్రమను దాని తీరుతెన్నులను పిడులకు పొదుగబడిన వెలగల రాళ్ళనుగూర్చి తెలుసుకొన గోరు వారికి ఈ మ్యూజియంలో ఎంతో సామగ్రి లభించ గలదు.

మూడవ సాలార్జంగ్ అయిన నవాబ్ యూసుఫ్ అలీ ఖాన్ అమూల్య వస్తు సేకరణ విషయంలో తన పూర్వీకులను కూడా మించి పోయ్యాడు. ఆయన కళాభిమానం అటువంటిది. తాను ప్రయాణం చేసిన ప్రతిదేశంలోను చిత్రమైన, ఆకర్షణీయమైన వస్తువులు ఏవి కనబడితే వాటిని కొని తన సౌధానికి చేర్చేవాడు. అందుచేతనే ఈ మ్యూజియం ప్రసిద్ధులయిన అనేకుల అభిప్రాయంలో ఆసియా ఖండం మొత్తం లోనే చాలా గొప్పది. కేవలం కళా విషయకమైన వటినే సేకరించి ఊరుకొనక, మూడవ సాలార్జంగ్ పారిశ్రామికంగాకూడా విలువగల వస్తువులను సేకరించాడు. ఉదాహరణకు ఆయన యూరపు వర్ణచిత్రాలలో ల్యాండ్సీర్, వాట్స్, లేటన్, కూపర్ మొదలగువారి కృతులతో పాటు పదు నాల్గవ లూయి, పదిహేనవ లూయీ, ఆనీరాణి, విక్టోరియా ప్రారంభకాలాలకు చెందిన ఫర్నీచర్ కొయ్య సామగ్రి నమూనాలు చాలా వున్నవి. ఆసియా ఖండ విభాగంలో ఈజిప్టు, డెమాస్కస్, కాశ్మీరు, దక్షిణ భారత దేశముల మేలురకం కొయ్య చెక్కడాలు విశిష్టంగా కన్పిస్తాయి. మ్యూజియంలోని ఫర్నీచర్‌లో రెండు దంతపు కుర్చీలు కూడా వున్నవి. ఇవి టిప్పూసుల్తానుకు చెందినవని చెప్పబడుచున్నది. దంతపు చెక్కడంలో దక్షిణ భారత కళాకారుల నైపుణ్యాన్ని ఈ రెండు కుర్చీలు చాటుతున్నవి.

ప్రాచ్యదేశాలలో శ్రీమంతులైన వారి ఇండ్లలో తివాచీలు, రత్నకంబళ్ళు ఉండడం సర్వసాధారణమైన విషయం. సాలార్జంగ్ మ్యూజియంలోకూడా అనేక రకాల తివాచీలున్నవి. కాషాన్ మఖ్మల్ జరీతివాచీలు, కిర్మాన్ 'కల్పవృక్షం' తివాచీలు, పశ్చిమోత్తర పారశీక తివాచీలు, తబ్రిజ్, షిరాజ్, ఇస్ఫహాన్, హెరత్ మగ్గముల పనితనమును తెలియపరిచే తివాచీలు ఇందులో వున్నవి. యూరపు ఖండం నుంచి, భారత దేశంలోని వివిధ ప్రాంతాలనుంచీ తెచ్చిన తివాచీలు కూడా ఉన్నవి. తివాచీల పరిశ్రమనుగూర్చి తెలుసుకొన గోరు వారికి ఇవి చక్కని అవకాశం కల్పిస్తాయి.

మ్యూజియంలోని అద్దాల మందిరాలలో ప్రాచ్యదేశాల ఘనత గోచరిస్తుంది. ఇందులో కప్పులనుంచి వ్రేళ్లాడే పలువందీపపు సెమ్మెలు శ్రేష్ఠమయినవి. ఇంకా ఎన్నో రకాల వస్తువులుకూడా వున్నవి. స్వాగత మందిరంలోను, దర్బారు హాలులోను ఇంగ్లండు మరియు యూరపు ఖండంలోని వివిధ దేశాలలో తయారయిన గాజు, పింగాణీ వస్తువులనేకం ప్రదర్శించబడినట్టి షో కేసులు కలవు.

పిల్లల కొరకై ఈ మ్యూజియంలో బొమ్మల గదులు కొన్ని కలవు. వీనిలో ఢిల్లీ, లక్నో నగరాల పనివారల ప్రావీణ్యమును తెలిపే ఆటవస్తువులు బొమ్మలు చాలావున్నవి.

సాలార్జంగ్ మ్యూజియంలో ప్రదర్శించబడిన సామగ్రి, వస్తువులు, శిల్పాలు, కళాఖండాలు కళలయందు, పరిశ్రమలయందు ఆసక్తిగలవారికేకాక సామాన్యప్రజలలో కళానురక్తి, సౌందర్యప్రియత్వం కలుగజేయడానికి ఉపయోగపడుతాయి. ఈమ్యూజియంయొక్క విద్యావైజ్ఞానికవిలువ గొప్పది.

ప్రస్తుతం సాలార్జంగ్ మ్యూజియం రాష్ట్ర ప్రభుత్వంచే ఏర్పాటుచేయబడిన ఒక కమిటీ పరిపాలనాధ్వర్యంలో వున్నది. ఈ కమిటీకి నవాబ్ మెహిదీ నవాజ్‌జంగ్ అధ్యక్షులుగా ఉన్నారు. నవాబుగారు దీనియొక్క విద్యావిలువను పెంపొందింప జేయడానికి ప్రయత్నిస్తున్నారు. వారి కృషికి కళాభిమానులు, దేశీయులు ప్రోత్సాహ మివ్వాలి. ★

# హైదరాబాదును గూర్చి ఒకవిదేశీయుని అభిప్రాయాలు

## ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రశంస


మిస్టర్ హాన్స్‌డాల్

*అంతర్జాతీయ విద్యార్థి సంఘానికి చెందిన మిస్టర్ హాన్స్‌డాల్ ౧౯౫౫ ఏప్రిల్ నెల చివరివారంలో హైదరాబాదుకు విచ్చేశారు. హైదరాబాదు నగరాన్నిగూర్చి ఆయన ఈ క్రింది అభిప్రాయాలు వెలిబుచ్చారు.*

"నేను ఇక్కడికి రాకపూర్వం హైదరాబాదును గూర్చి నాకు అంతగా తెలియదు. కాబట్టి ఇది ఎలా వుంటుందోకూడా నేను ఊహించలేక పోయాను. హైదరాబాదు రాష్ట్రం దక్షిణ భారతానికి మధ్యలో వున్నదని నాకు తెలుసు. అందుచేత ఇక్కడ చాలా వేడిగా వుంటుందని అనుకున్నాను. ఈ విషయంలో నేను అనుకున్నట్లుగానే వున్నది. ఇక్కడ ఎండ తెక్కువ. చలిగా వుండే స్కాండినేవియాకూ ఇక్కడికీ చాలా వ్యత్యాసం వున్నది. హైదరాబాదు సముద్రతీరానికి చాలాదూరంలో ఉండడంచేత ఇది ఎడారిమాదిరిగా వుంటుందని నేను అనుకున్నాను. కాని నా ఈ భావన సరిగాదని ఇక్కడికి వచ్చి చూచిన తరువాత తెలిసింది. ఒక సరస్సుచుట్టూ వున్న అందమైన ఉద్యానవనంలో వెలసిన నగరంలా నాకు హైదరాబాదు నగరం కన్పించింది. హైదరాబాదు అంటే పచ్చని చెట్లు, చక్కనిఉద్యానవనాలు, తీయని మంచినీరు అనే భావం నాకిప్పు డేర్పడింది. నన్నాకర్షించిన మరొక విషయం ఇక్కడి భవననిర్మాణం. బొంబాయి, మద్రాసు నగరాలలోలాగా ఇచటి నిర్మాణాలపై విదేశీప్రభావం లేదు. శాసనసభా భవనం ఎంతో అందంగా వుంది. భారతదేశంలో సాధారణంగా కన్పించే భవనాలకంటే ఈభవనం భిన్నమైనది. దీన్ని చాలా శుభ్రంగా వుంచుతారు.

### ఉస్మానియా విశ్వవిద్యాలయం

విద్యార్థుల ప్రతినిధిగా నేను అనేక దేశాలలో పర్యటించాను. ప్రపంచమంతటా వున్న విశ్వవిద్యాలయాలను గూర్చి నాకు బాగా తెలుసు. ఈ విషయంలో ఒక విధంగా నేను ప్రవీణుడను కూడా నేను. కాని ఉస్మానియా విశ్వవిద్యాలయం, ముఖ్యంగా ఆర్ట్సు కాలేజీ భవనం నన్నెంతో ఆకర్షించింది. నాకు తెలిసినంతవరకు ఇటువంటి భవనం మరొకటిలేదు. భవనం లోపల విశాలమైన వరండాలు, చక్కని ఆరుబయళ్లు, పార్కులు మంచి సుగ్గడవయ్యాను. ఈమధ్య మాకొక్క విశ్వవిద్యాలయాన్ని గూర్చి అనుకరించి కాలేజీ లనుగూర్చి కొందరు ఎక్కువగా చెప్పుకోవడం జరుగుతున్నది. కాని నాకు ఈ విశ్వవిద్యాలయమే నచ్చినది.

చివరకు మరొకవిషయాన్నిగూర్చి చెప్పవలసి వున్నది. హైదరాబాదులో నాకు చక్కని ఆతిథ్యం లభించింది. ఈ ఆతిథ్యాన్ని నేను ఎన్నటికీ మరచిపోలేను. ఇక్కడి విద్యాశాఖామంత్రి, శాసనసభ్యులు, విద్యార్థులు, పౌరులు నన్నెంతో ఆదరించారు. వారి ప్రేమానురాగాలవల్లనే ఇక్కడికి నేను వచ్చిన పని సుకరమైనది. ఇక్కడ నాకు లభించిన ఆదరణనుబట్టి ముందుముందు ఆసియా యూరపు ఖండాల విద్యార్థుల మధ్యను, ప్రపంచప్రజల మధ్యను సన్నిహిత సహకార భావం, సౌమనస్య సుహృద్భావాలు ఏర్పడ గలవని విశ్వసిస్తున్నాను." ★

# ★ హైదరాబాదు రాష్ట్ర చేతిపరిశ్రమలు ★

## విదేశాలలో సైతం మంచి పేరు ప్రఖ్యాతులు

### రాష్ట్ర చేతిపరిశ్రమల సరుకుల విక్రయపు ఏర్పాట్లకొరకై ప్రభుత్వం తీసుకొన్న చర్యలు



*చిరకాలంనుంచి దక్కన్ ప్రాంతం చేతిపరిశ్రమలకు ప్రసిద్ధి వహించినది. యంత్రముల ద్వారా తయారుచేయబడు వస్తువుల పోటీ విశేషంగా ఉన్నప్పటికీ, ప్రజల అభిరుచులు ఫేషనులు ఎప్పటికప్పుడు మారుతూ వచ్చినప్పటికీ, హైదరాబాదు రాష్ట్రంలో చేతిపనులు మాత్రం మూల బడిపోక నిలిచివున్నవి.*

ఇందుకు తార్కాణము బిద్రీసామానులు, హిమ్రూ, మష్రూ, కంఖాబ్, నిర్మల్ కొయ్య వస్తువులు మొదలైనవి. ఇవి అత్యంత ప్రశస్తముగా తయారుచేయబడు తున్నవి. భారతదేశంలోనే గాక బ్రిటన్, కెనడా, అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఇతర విదేశాలలో ఇవి వేనోళ్ళ కొనియాడబడు తున్నవి.

ఔరంగాబాదు హిమ్రూ వస్త్రములు, అదిలాబాదు జిల్లాలోని నిర్మల్ కొయ్య బొమ్మలు, కరీంనగరు వెండివస్తువులు, బీదర్ బిద్రీ సామానులు, పైఠాన్‌లోని అందమైన జరీ అంచులు, కలము లు, దంతములు కొమ్ములతో తయారు చేయబడునగిషీ వస్తువులు, వీటికి ఎల్లప్పుడూ గిరాకీ యున్నది.

మార్కోపోలో అను ఒక విదేశీ యాత్రికుడు, తన యాత్రలను గురించి వ్రాసిన పుస్తకములో దక్కన్‌లో బంగారు, వెండి పోగులతో తయారగు నాణ్యమైన వస్త్రములను గురించి పేర్కొన్నాడు. వాటి పనితనమును వ్యాఖ్యానిస్తూ అతడు ఇలా అన్నాడు: "దీనిని సాలీడు గూడుతో పోల్చవచ్చు. ప్రపంచంలో ఏ దేశపు రాజులైనా రాణులైనా, వీటిని ధరించటానికి గర్వపడతారు."

### హిమ్రూ పరిశ్రమ

హిమ్రూ వస్త్రములు నేయడం చాలా క్లిష్టమైనపని. ఇవి ప్రత్తి నూలుతో ఆకర్షణీయమైన కృత్రిమ పట్టుదారంగులతోను, దట్టమైన రంగులతో, పల్చని రంగులలో రకరకాల డిజైనులతో నేయబడు తాయి. ఇవి స్త్రీల బ్లౌజుల కొరకు మాత్రమేగాక పర్దాలు మొదలగు వాటికి గూడ ఉపయోగ పడుతాయి. పల్చని రంగుగలవి షేర్వానీలకు అనువుగా ఉంటాయి.

హిమ్రూ వస్త్రం ఔరంగాబాదులో నేయబడుతుంది. ఈవస్త్రము నానా వర్ణ రంజితమై ఉంటుంది. పేక నూలును ఎక్కువగావేసి, దట్టముగా చేయడంవల్లనే ఇది కడు అలంకారంగా తయారు చేయబడుతుంది. డిజైనులను తీర్చి దిద్దడం, చారలు, వంపులు, నానావిధ రంగులతో శోభాయమానంగా నేయడం, పోగుల నన్నిటినీ వేలితో కడు చమత్కారముగా సరికూర్చడం ఇవన్నీ పనితనాన్ని కళాభినివేశాన్ని తెలియజేస్తాయి. అయితే నేత మాత్రం కొద్దిగా దట్టంగా ఉంటుంది. ప్రతి చదరపు గజంలో వీటి బరువు మూడునుంచి ఐదు ఔన్సులవరకు ఉంటుంది. హిమ్రూ వస్త్రములలో ఒకొక్క అంగుళంలో ౨౦౦ పోగులు ఉండడం సామాన్యమైన విషయం.

అయితే ఈ పరిశ్రమ చాలా త్వరగా పతనం చెందడానికి, యంత్రములతో తయారయిన వస్త్రములు పోటీపడడం, ప్రజల అభిరుచులలో మార్పు రావడం, తగు ఆదరణ లేకపోవడం ప్రబల కారణాలయి ఉన్నవి. తత్ఫలితంగా ప్రస్తుతం చాలా కొద్ది మగ్గములు మాత్రమే పనిచేస్తున్నవి. వాణిజ్య పరిశ్రమల శాఖ ఈ పరిశ్రమకు అవసరమైన సహాయము చేస్తున్నది. ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాల, స్థానిక కార్ఖానాలలో ఉత్పత్తియగు హిమ్రూ వస్త్రములను కొని, వాటిని భారతదేశంలోనే గాక, విదేశాలలో కూడా విక్రయించుటకు ఏర్పాట్లు చేస్తున్నది. వాణిజ్య పరిశ్రమల శాఖ చేస్తున్న సాంకేతిక సహాయంతో, హిమ్రూ వస్త్రముల డిజైనులు వగైరాలు అభివృద్ధి పరపబడినవి. వీసి సూలుకు ఉపయోగించబడు రంగులు చాలా దట్టంగా ఉంటాయి. అందుచేత వాణిజ్య పరిశ్రమల శాఖ ఈ నేత పనివారలకు దట్టమైన రంగుగల నూలు మాత్రమే లభింపజేస్తున్నది. వివిధ హిమ్రూ డిజైనులు, వస్త్రముల నమూ

నాలుగు గల చిత్రపటముల సంపుటి ఒకటి ఇప్పుడు తయారుచేయబడు తున్నది.

నలభై మంది హిమ్రూ కార్మికులతో ఒక సహకార సంఘం ఏర్పాటు చేయబడింది. ఈ సంఘం వస్త్రములను ఉత్పత్తిచేయడం ఆరంభించింది. ఈ పరిశ్రమాభివృద్ధికై భారత ప్రభుత్వంవారు గ్రాంటు క్రింద రూ. ౮౧౧౨ లు, అప్పు క్రింద రూ. ౨౪,౯౦౦ లు మంజూరు చేశారు. ఈ సంఘానికి పెట్టుబడికొరకు, వాటాల మూల ధనములకు గాను, ఈ అప్పు మొత్తమును పంపిణీచేయుటకు తగు చర్యలు గైకొనబడినవి. ఈ పరిశ్రమకు అవసరమైన పరికరము లను కొనుటకు మరొక రూ. ౫,౦౦౦ ల గ్రాంటు మంజూరు చేయ బడినది. వాణిజ్య పరిశ్రమలశాఖ కృషి ఫలితంగా హిమ్రూ వస్త్ర ముల ఉత్పత్తి, వాటి విక్రయం చాలా వరకు పెరిగింది.

## పైఠాన్ జరీ చెరగులు

జరీ, సిల్కులను సొంపుగా సమ్మిళితం కావించి, వెండి, బంగారు పోగులలో అందమైన పువ్వులలో, వివిధ డిజైనులలో పైఠాన్ చీరె చెరగులు నేయబడుతాయి. వీటిలో కొన్నిటి వెల ఒక్కొక్కటి వెయ్యిరూపాయలు కూడా వుంటుంది. అతీ సుందరమైన నేతపనిగల ఈ చెరగులు ఇప్పుడు మేజాబల్లలను అలంకరించుటకు విశేషంగా ఉపయోగింప బడుతున్నవి.

పైఠానులోను, ఔరంగాబాదులోను చేతితో తయారుచేయబడు వెండి, బంగారు పోగులు చాలా వాసికెక్కినవి. వెండి కడ్డీలు బంగారు పోగులతో దట్టముగా పూతపూయ బడుతాయి. ఈ వెండి కడ్డీల పొడవు ఒక్కొక్కటి సాధారణంగా ౮ అంగుళములు ఉంటుంది. ఈ కడ్డీలు ఒక్కొక్కటి ఉక్కు ప్లేట్ రంధ్రముల గుండా అనేక వందల గజముల పొడవు అయ్యేవరకు సాగదీయ బడుతాయి. అవి తగినంత సున్నితముగా తయారు అయిన తరు వాత, సింథాద్‌పై సరిగు బుటాలకు యోగ్యంగా ఉంటాయి.

ఈ పరిశ్రమను సహకార పద్ధతిపై వ్యవస్థీకరించుటకు భారత ప్రభుత్వం దీనికి రు. ౨,౦౪౦ లను గ్రాంటును, రు. ౧౬,౧౨౫ లను అప్పుగాను మంజూరు చేసింది. తదనుగుణంగా నేతపనివారల సహకారసంఘం ఒకటి ఏర్పాటు చేయబడింది. ఈ సంఘానికి వాటా మూలధనం పెట్టుబడి మూలధనంగాను మంజూరయిన రు. ౧౬,౧౨౫ ల మొత్తం వారికి పంపిణీ చేయబడింది. ఇది



హైద్రాబాదు నగరంలో చేతిపనుల సప్తాహానికి ముఖ్యమంత్రిగారు ప్రారంభోత్సవం చేశారు.



*చేతిపనివస్తువుల ప్రదర్శనంలో బొమ్మలు, ఆటవస్తువుల విభాగాన్ని రాష్ట్ర ఆర్థికమంత్రి పరిశీలిస్తున్నారు.*

వరకు పనిలేకుండా ఉండిన పైఠాన్ నేత పనివారలు ఇప్పుడు సహకార పద్ధతిపైన ఉత్పత్తి కార్యక్రమంలో నిమగ్నులై ఉన్నారు.

## వెండి పని

కరీంనగరం వెండి పనికి చిరకాలంనుంచి ప్రసిద్ధి చెందినది. స్థానిక కంసాలీ పనివారల అతి సున్నితమైన పనితనం ఇందులో కనిపిస్తుంది. ఇప్పుడు ఈ పరిశ్రమలో సుమారు ౧౨౦ మంది పనివారలు పనిచేస్తున్నారు. సాధారణమైన కంసాలీ పనిముట్లు మాత్రమే ఇందులో ఉపయోగించబడుతాయి. ఆష్‌ట్రేలు, గాజులు, పాన్‌దాన్‌లు, గుండీలు, బరిణెలు, సిగరెట్టు పెట్టెలు, పూలవ్యాజులు, ఫౌన్‌టెన్ పెన్నులు- పతకములు, అత్తరు బుడ్లు, ఫొటో ఫ్రేములు, ఫొటో హోల్డర్లు, పౌడరు డబ్బీలు, చెంచాలు మున్నగు వెండి వస్తువులు ఇక్కడ తయారవుతాయి.

ప్రజల అభిరుచులు మారినప్పటికీ, ప్రస్తుతం వీటికి గల గిరాకీ సన్నగిలుతున్నప్పటికీ, వెండి పని ఒక ముఖ్యమైన చేతి పని అని చెప్పక తప్పదు.

అయితే ఈ పరిశ్రమకు మంచి భవిష్యత్తు ఉన్నది. భారతదేశంలోను, విదేశాలలోను అపూర్వమైన, సాటిలేని ఈ వెండి వస్తువులకు అనువైన మార్కెట్లు వున్నప్పుడు ఈ పరిశ్రమ అభివృద్ధిచెందే అవకాశం ఉన్నది.

వాణిజ్య పరిశ్రమలశాఖవారు వెండి వస్తువులను కొని వాటిని ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాల ద్వారా అమ్మించుతున్నారు. దానివలన వెండిపని వారలకు సహాయం జరుగుతున్నది.

కరీంనగరంలో వెండి పని పరిశ్రమను అభివృద్ధి పరచుటకు భారత ప్రభుత్వంవారు గ్రాంటు రూపంలో రూ. ౩౩,౨౦౦ లను మంజూరు చేశారు. ఇందుకు అవసరమైన యంత్ర సామగ్రి కొనబడి, వెండిపనిచేయు పనివారల ఉపయోగార్థం కరీంనగరంలోని గ్రామ పరిశ్రమల అభివృద్ధికేంద్రంలో నెలకొల్పబడినది. ఇవటి వెండి వస్తువుల నాణ్యమును, పనితనమును అభివృద్ధి పరచుటకు, ఈ యంత్ర పరికరములు తోడ్పడుతాయి.

## బీద్రీ సామానులు

దక్కనులో బహమనీ రాజుల పరిపాలన కాలంలో వారు బీద్రీ సామానుల పరిశ్రమను ప్రోత్సహించి పోషించారు. దీనికి పారసీక దేశంతో సాంస్కృతిక, కళాత్మకమైన సంబంధం కలదు. కనుక అరేబియా, పారసీక దేశాలలో గల ప్రాచీన కళతోపాటు దీనికి

ఉభయ సామాన్యమైన పూర్వచరిత్ర కలదు. ఆదేశాలలో ఉక్కు పైన గానీ లేక రాగి పైనగానీ, వెండి, బంగారములు పొదుగబడి ఉంటాయి. అయితే ఇక్కడ మాత్రం ఉక్కు లేక రాగికి బదులుగా కొద్ది నిష్పత్తులలో తుత్తునాగము, రాగి ఇతర ధాతువులు కలిసిన ఒక నల్లని సీసపు రంగు గల మిశ్రమ ధాతువు ఉపయోగింపబడు తుంది ఇట్టి నూతన కల్పన భారతదేశానికి, ముఖ్యంగా బీదరుకు ఒక ప్రత్యేకతను కల్పించినది. ఈ మిశ్రమ లోహం ఎప్పుడు కూడ త్రుప్పు పట్టదు; చెడిపోదు.

మొట్టమొదట ఈ మిశ్రమలోహంతో పళ్లెములు, త్రాగే నీటి గిన్నెలు, హుక్కాలు, మైనపువత్తి సెమ్మెలు, సుగంధ ద్రవ్యములు, పరిమళ ద్రవ్యములు భద్రపరచు పెట్టెలు, పళ్లెరములు, పూల వ్యాజులు మున్నగునవి తయారు చేయబడుతూ ఉండేవి. దీనితో తయారైన నీళ్ళ బిందెలకు ఎక్కువ గిరాకీ ఉండేది. ఎందుకంటే ఇందులోపోసిన నీటికి ఈ లోహంవల్ల కొన్ని రోగ నివారక గుణ ములు కలుగుతాయని ఒక విశ్వాసమున్నది. ఇప్పుడు చుట్ట, సిగ రెట్టు పెట్టెలు, ఆష్ట్రేలు, చేతిగుండీలు, ఇతర పాత్రలు మున్నగు వస్తువులు కూడా దీనితో తయారుచేయబడుతున్నవి.

బీదరీ సామానులపై వేయబడు చిత్రములు సాధారణంగా బీదరులోని చరిత్రాత్మకమైన కోటనుంచి, ప్రపంచ ఖ్యాతిగాంచిన అజంతా గుహలలోని గోడలపైనుండు బొమ్మలనుండి గ్రహించ బడుతాయి. ఇటీవల అనేక ఆధునిక డిజైనులు కూడా వేయబడు తున్నాయి.

బిద్రీ సామాను పనితనం అద్భుతమైనది. దీనిని గూర్చి ప్రొఫె సరు స్పెయిట్ ఇలా అన్నారు. "వాస్తవంగా బిద్రీ సామాను గొప్ప పనితనమును కలిగి ఉన్నది. ఇది మైసూరు, కాశ్మీరుల కొయ్యపని, మద్రాసు, బెనా రసు లోహపు పని, తిరువా న్కూరు దంతపు నగిషీపని, నేపాలు ల్యాంపులు, పూజా పాత్రల పనితనముతో తుల తూగుతుంది".

ఈ పరిశ్రమ అభివృద్ధికై భారత ప్రభుత్వమువారు రూ. ౪౫,౬౭౨ ను మంజూరు చేశారు. ఈ మొత్తంలో రు. ౧౩,౪౨౨ లు గ్రాంటు గాను, రూ. ౩౨,౨౫౦ లు అప్పుగాను ఇవ్వబడినది. ఈ పరిశ్రమకు అవసరమైన యంత్రములు, యంత్రపరికర ములు కొనబడినవి. ప్రస్తుతం వున్న నాలుగు సహకార సంఘాలకు పెట్టుబడి, వాటా మూల ధనములక్రింద ఈ అప్పు ఇవ్వబడినది.

## తివాచీ పరిశ్రమ

వరంగల్ తివాచీలు దక్కన్‌కు గర్వకారణమని చెప్పవచ్చు. సుమారు నూరేండ్ల క్రిందట, అంటే ౧౮౫౧ సం. లో లండను నగరంలో జరిగిన బ్రిటిష్ సామ్రాజ్య వస్తుప్రదర్శనంలో 'ప్రద ర్శింపబడిన శ్రేష్ఠమైన కంబళ్లు వరంగల్ నుంచి వచ్చినవే' అవే దక్కను కంబళ్ళు' అని పేరుగాంచినవి. ఇవి సిల్కు, ప్రత్తి లేక ఉన్ని నూలుతో నేయబడుతాయి. ఉన్ని కంబళ్ళు, 'గలాయిచీ'అనీ, తివాచీలు'కాలిన్' అనీ ప్రసిద్ధిచెందినవి. వీటితో ప్రతి పడుగు పోగు లోను గట్టి ప్రత్తినూలు, రంగులుగల ఉన్నిపోగులు వేయబడుతాయి. ఇక్కడి తివాచీలపైగల డిజైనులు పారసీక దేశమునకు చెంది నప్పటికీ స్థానిక కూర్పులు చాలా ఉన్నవి. వీటి రంగుల డిజైను లన్నీ స్థానికంగా లభించు ఉన్నితో మేళవించబడతాయి.

ఈ పరిశ్రమాభివృద్ధి కొరకు రాష్ట్రచేనేత పనుల సంఘం ఒక పథకమును తయారుచేసింది. ఈ పరిశ్రమను ఆధునిక పద్ధతుల కనుగుణంగా పునర్వ్యవస్థీకరించి సహకార పద్ధతిపై పునరుద్ధరించే దృష్టితోనే ఈ పథకం తయారుచేయబడింది. భారత ప్రభుత్వం ఇందుకు సహాయంగా రూ. ౨,౯౪౦లు, అప్పుగా రూ. ౬,౦౦౦౦ లున్ను మంజూరుచేసింది.

## కొయ్యబొమ్మల పరిశ్రమ

నిర్మల్ లక్కపరిశ్రమ ప్రసిద్ధిగాంచినది. ఆట బొమ్మలు, ఇతర వస్తువులు చాలా తేలికయైన బూరుగు, పునికి కొయ్యతోతయారుచేయ బడుతాయి. చింతగింజలను నానబెట్టి, ఎండబెట్టి పొట్టుతోపాటు పిండి చేసి దానిని నీటిలోఉడకబెట్టగా ఏర్పడే జిగురు ఈ వస్తువులకు పైపూతగా ఉపయోగించ బడు తుంది. నిర్మల్ ఆటబొమ్మలకు ఇతరకొయ్యవస్తువులకుసహజ మైన, దట్టమైన, శాశ్వతమైన రంగులు, వేయబడుతాయి. ఈ పరిశ్రమలో కొయ్య పళ్ళెకలు కొయ్య పెట్టెలు, చదరంగపు వస్తువులు, పేకలు, స్క్రీన్ పేనల్స్, జంతువులు, పక్షులు, కూరగాయలు, ఫలముల ప్రతి మలు తయారుచేయబడుతాయి. ఆదిలాబాదుజిల్లా నిర్మల్‌తాలూ కాలో పనివారలు వీటిని తమ గృహములలోనే చేస్తారు.



చేతిపని వస్తువుల ప్రదర్శనము
నొకదానికి రాష్ట్ర ఆర్థికమంత్రి ప్రారంభోత్సవం సల్పారు.

ఈ పరిశ్రమను పునరుజ్జీవింప జేయుటకు భారత ప్రభుత్వం సహాయంక్రింద రు. ౧౬,౭౦౦ లు, అప్పుక్రింద రూ. ౧౦,౦౦౦లు మంజూరుచేసింది. ఆట బొమ్మలు తయారుచేయడంలో వృత్తి పని వారల బాలురకు శిక్షణ ఇచ్చుటకు వాణిజ్య పరిశ్రమలశాఖవారు అనుభవంగల ఒక టాయ్ మాస్టర్‌ను నిర్మల్‌కు పంపినా రు.౧౯౫౫ ౧వ తేదీ నుంచి ౧౦ మంది అభ్యర్థులు శిక్షణ పొందుతున్నారు.

పారిశ్రామిక ధర్మకర్తృత్వ నిధి ఇచ్చిన సహాయంతో నిర్మల్ లక్క పరిశ్రమ ఇటీవలనే పునరుద్ధరించబడింది. మార్కెటులోని పళ్ళెములు, పైకప్పుగల దీపస్తంభముగలు,చుట్టల పెట్టెలు,సిగరెట్టు కేసులను, స్త్రీ పాదరక్షల పుడిమలు, భోజన పాత్రల సెట్లు, దీపపు సెమ్మెలు, సొమ్ముల పెట్టెలు, వర్ణచిత్రములు అందమైన ఫర్నీచర్ మున్నగు వస్తువులు వచ్చినవి. ఇవి ఆకర్షణీయంగానూ, మన్నికగానూ ఉంటాయి. మంచి పనితనంతోకూడిన డిజైనులేకాక, మూలికల రసంతో బంగారు ఛాయ వచ్చునట్లుగా రంగువేయటంలోను నిర్మల్ పనికి ప్రత్యేక విశిష్టత ఉన్నది.

## చేతిపనుల వస్తువుల అమ్మకం

ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాల ౧౯౩౦ సంవత్సరంలో స్థాపించబడింది. రాష్ట్రంలో ఉత్పత్తియగు చేతి పనుల వస్తువులను విక్రయించుటకు తగు ఏర్పాట్లు చేయడానికి ఇది ప్రధాన వ్యాపార సంస్థగా వ్యవహరిస్తున్నది. దీనికి ఔరంగాబాదులో కూడా ఒక శాఖ ఉన్నది.

ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాల ఇటీవలనే పునర్వ్యవస్థీకరింపబడినది. ఇది శాశ్వతంగా పనిచేయుటకు కూడా ఏర్పాట్లు చేయబడినవి.

ఇటీవల కొన్ని సంవత్సరాలుగా విక్రయశాల చేసిన విశేష ప్రచారం వల్లనూ, ముఖ్యంగా భారత దేశంలోనూ, విదేశాలలోను ఈ వస్తువుల ప్రదర్శనములు జరుపడం వల్లను రాష్ట్రంలోని చేతి పనుల వస్తువులు పేరు ప్రఖ్యాతులు గడించుకుంటున్నవి. వీటి క్రయ విక్రయ వివరములను గూర్చి తెలుసుకొనుటకు చాలా మంది శ్రద్ధ చూపుతున్నారు.

రాష్ట్ర చేతి పనుల వస్తువుల కొరకు మార్కెట్లను విస్తృతపరచే ఉద్దేశంతో, ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాలను అభివృద్ధి పరచుటకుగాను రూ. ౩,౫౦,౦౦౦ ఆర్థిక సహాయం పొందుటకు భారత ప్రభుత్వానికి ఒక పథకం అందజేయబడింది. పై పథకం మంజూరయితే ఈ విక్రయశాల కార్యకలాపాలను తీవ్రతరం చేయుటకు వీలుపడుతుంది. ఇంతేగాకుండా త్వరిత గతిని వ్యాప్తి



*చేతిపనివస్తువుల ప్రదర్శనాన్ని పరిశీలిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రిగారు.*

చెందుతున్న మార్కెట్ల గిరాకీని ఆదుకొనుటకు వీలు కలగడమే గాక పరస్పర వాణిజ్య సంబంధపు ఏర్పాట్లు చేసుకొనుటకు కూడా అవకాశం ఉంటుంది.

## అద్దకపు వస్త్రములు

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కలిగిన సత్ఫలితాలలో ప్రముఖంగా పేర్కొనదగిన ఒక విషయ మేమంటే మన రైతాంగపు జీవితానికి సంబంధించిన ప్రతియొక్క అంశముపైన ప్రజలలో అత్యంతాసక్తి కలిగింది. విదేశాలలో యంత్రములద్వారా చవుకగా తయారుచేయబడిన సరుకులపై అభిరుచి, అలవాటు కలిగిన మన తరం వారికి మన దేశం యొక్క చేతిపనులలో, కుటీర పరిశ్రమలలో ఎటువంటి విన్నాణమున్నదో ఇప్పుడే అవగత మవుతున్నది.

ఒక కాశ్మీర్‌లో తప్ప భారతదేశంలోని మరియే ఇతర రాష్ట్రంలోను హైద్రాబాదులో ఉన్నటువంటి రకరకాల చేతి పనులు లేవు. హైద్రాబాదు రాష్ట్రంలో ప్రతి జిల్లాలో ఉన్న ఒక్కొక్క పరిశ్రమలో దాదాపు ఎన్నో తీరుల డిజైనులు ఉన్నాయి.

హైదరాబాదు రాష్ట్రం, పరిశ్రమల విషయంలో ఇప్పుడు భారత దేశంలోని ఇతర ప్రాంతాలలో పేరెన్నిక గంటున్నది. నల్లగొండ జిల్లా పోచంపల్లిలో తయారయ్యే ఎరుపు నలుపు రంగు రుమాళ్ల పరిశ్రమ ఈ రాష్ట్రపు ప్రాచీన పరిశ్రమలలో ప్రసిద్ధమైనది. ఈ రుమాళ్ళు అక్కడి రైతుల దుస్తులుగా ఉన్నాయి. ఈ రుమాళ్ల పరిశ్రమకు ఒక విశిష్టత కలదు. ఇటువంటి పరిశ్రమ భారతదేశంలో కొన్ని ప్రాంతాలలోనే సజీవంగా ఉన్నది జాల్నాలో నేయబడే పదోలా చీరెను గూర్చి కొందరికి మాత్రమే తెలుసును ఒకప్పుడు నిజాంకాలంలో ప్రపంచ ప్రసిద్ధమైన ఔరంగాబాదులోని మష్రూ పరిశ్రమకు చాలా గిరాకీ ఉండేది. అది కూడా పై పద్ధతిలోనే నేయబడుతుంది. దానిని కూడా పునరుద్ధరించవలసిన అవశ్యకత ఉన్నది.

రాష్ట్రచేతి పనుల సలహా సంఘంయొక్క సిఫారసుల ననుసరించి ౨౦ మంది చేతపనుల వారికి అద్దకపు పరిశ్రమలో శిక్షణ యిచ్చుటకుగాను అఖిలభారత చేతిపనుల బోర్డువారు రూ. ౨౬,౫౯౪ లు ఖర్చుఅయ్యే ఒక పథకాన్ని మంజూరు చేశారు.

## ఇత్తడి పరిశ్రమ

బీదు జిల్లాలోని అమల్నేర్, మెదకు జిల్లాలోని సిద్దిపేట ఇత్తడి పరిశ్రమకు ప్రసిద్ధిగాంచినవి. ఈ పరిశ్రమను సహకార పద్ధతిపై అభివృద్ధిపరచడానికి రాష్ట్రచేతిపనుల సలహా సంఘం, భారత ప్రభుత్వానికి ఒక పథకాన్ని అందజేసింది. ఇందు కొరకై భారత ప్రభుత్వం రూ. ౨౧,౦౫౫ ల గ్రాంటును, రూ. ౩౦,౦౦౦ ల అప్పును మంజూరు చేసింది. గ్రాంటు రూపంలో లభించిన మొత్తం యంత్రములను, పరికరములను కొనడానికి, మేనేజరుగానూ, అకౌంటెంట్‌గాను పనిచేసే వ్యక్తికి వేతనం చెల్లించడానికి వినియోగించబడుతుంది. అప్పుగా లభించిన మొత్తం, ఇత్తడి పరిశ్రమ పనివారల సహకార సంఘాలకు పెట్టుబడికిగాను మంజూరుచేయబడినది. ఆ సంఘాలు ఉత్పత్తిని హెచ్చించడానికి పనివారలకు తోడ్పడుతున్నవి.

## రాష్ట్ర చేతిపనుల సలహాసంఘం

హైద్రాబాదు ప్రభుత్వం, ౧౯౫౩ మే నెలలో కుమారి పద్మజా నాయుడు అధ్యక్షతక్రింద రాష్ట్ర చేతిపనుల సలహాసంఘాన్ని ఏర్పాటుచేసింది. ఈ సంఘంవారు తివాచీలు, కంబళ్లు, వస్త్రముల అద్దకం, వెండిపని, ఇత్తడిపని, కొయ్య బొమ్మలు పైఠాన్ జరీ చెరగులు, బీద్రీ పరిశ్రమ, హిమ్రూ పరిశ్రమ, చాపల తయారీ, లక్క గాజులు, సలీంషాహి పాదరక్షలు, టస్సార్ సిల్కు, పట్టు మొదలగు చేతిపనుల పరిశ్రమల అభివృద్ధి పథకములు తయారు చేశారు. ఈ పథకములు క్రొత్త ఢిల్లీలోని అఖిల భారత చేతిపనుల బోర్డువారికి మంజూరీ కొరకు పంపబడినవి. వాటిలో చాలా పథకాలను ఆ బోర్డువారు మంజూరుచేశారు.



# భూదానోద్యమ ఆచరణకు ప్రత్యక్ష దృష్టాంతము : పోచంపల్లి

ఆచార్య వినోబాభావే ప్రతిపాదించిన సర్వోదయ తత్వాన్ని, భూదానోద్యమాన్ని దక్షిణ భారతంలో తెలంగాణ నల్లగొండ జిల్లాలోని పోచంపల్లి గ్రామమే మొట్టమొదటి సారిగా ఆచరణలో పెడుతున్నదని చెప్పాలి. ఈ విషయాన్ని ఇటీవల వినోబాజీ ౬౧ వ జయంతి సభకు అధ్యక్షత వహించడానికై పోచంపల్లికి విచ్చేసిన హైద్రాబాదు ముఖ్యమంత్రి స్వయంగా తెలియజేశారు.

అసలు భూదానోద్యమం భారత దేశంలో మొట్ట మొదట పోచంపల్లి గ్రామంలోనే ఆరంభమయింది. ఆ గ్రామంలో శ్రీ రామచంద్రారెడ్డి అనే భూస్వామి ౧౦౦ ఎకరాల భూమిని దానంగా ఇచ్చారు. దానితో ఈ ఉద్యమానికి స్వరూపం ఏర్పడింది. భూదానోద్యమం జ్ఞాపకార్థంగా పోచంపల్లిలో స్మారకస్తంభాన్ని నిర్మించడానికై రాష్ట్ర ప్రభుత్వం రెండెకరాల భూమిని ఇచ్చి



*భూదానోద్యమం జన్మస్థానమైన పోచంపల్లి గ్రామంలో 1955 సెప్టెంబరు 11 తేదీన ఆచార్య వినోబాభావేగారి 61 వ జయంత్యుత్సవం జరుపబడింది. ఆ సందర్భంలో హైదరాబాదు ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావుగారు పెద్ద బహిరంగసభలో ప్రసంగించారు.*



*ఇది పోచంపల్లి చెఱువు—చెఱువుకట్టకు ఆవల పోచంపల్లి గ్రామాన్ని చూడవచ్చును.*

నట్లుగా ముఖ్యమంత్రి తెలియజేశారు. ఇప్పుడు శ్రీరామ చంద్రారెడ్డిగారు ఆ గ్రామానికి చెందిన మొత్తం ౨౦౦౦ ఎకరాల భూమిని ఏకం జేసి గ్రామస్తులందరూ కలిసి దాన్ని ఉమ్మడిగా సేద్యం చేసుకోవాలని ఒక ప్రతిపాదన చేశారు. ఈ ప్రతిపాదన అమలు జరిగించంటే సహకార వ్యవసాయ విధానం, సమజీవన పద్ధతి పెంపొందుతాయి.

భూదానోద్యమం మూలంగా, వ్యక్తులలో హృదయ పరివర్తన కలిగించి తద్వారా సామాజిక వ్యవస్థను మార్చాలని తలపెట్టిన విధానం మూలంగా కలిగిన పరిణామమే ఈ గ్రామదానం. భూమి యాజమాన్యం విషయంలో భారత దేశంలో అసమానత్వాన్ని తొలగించాలంటే ప్రాథమికమైన భూసంస్కరణలు అవసరమే. అయితే ఆ సంస్కరణల్లో అంతర్లీనమై వున్న సదసత్సంశయాన్ని ప్రజలంతా బాగా అర్థంచేసుకొని అందుకుపూనుకొననిదే అవి విజయవంతం కాజాలవు. ఇది వినోబాజీ అభిప్రాయం. అధిక సంఖ్యాకులైన ప్రజలు హృదయ పూర్వకంగా ఆమోదించే దానినే శాసనం సాధిస్తుంది. కాని భూదాన సిద్ధాంతం సమస్త ప్రజానీకంలోను అటువంటి అభిప్రాయపూర్వకమైన వాతావరణాన్ని కలిగించడానికి ఉద్దేశించబడింది.

వినోబాజీ వచ్చేసంవత్సరం జనవరి నెలలో పోచంపల్లి గ్రామానికి రానున్నారు. కనుక అప్పటికల్లా శ్రీరామ చంద్రారెడ్డిగారి ఆశయం ఆచరణ రూపం దాల్చాలని పోచంపల్లి గ్రామాన్ని ఇతర గ్రామాలు ఆదర్శంగా పెట్టుకోగలవనీ తామాశిస్తున్నామని ముఖ్యమంత్రి అన్నారు. హైదరాబాదు పెద్దరోడ్డునుంచి పోచంపల్లిని కలిపే మంచి రోడ్డును ఒకదానిని ప్రభుత్వం వేయిస్తుందని ముఖ్యమంత్రి ఈ సందర్భంలో ప్రకటించారు.

పోచంపల్లి గ్రామంలో ఒక వీథి.



పోచంపల్లి గ్రామంలోని ఆషూర్ ఖానా.—అంటే మహమ్మదీయ మతసంస్థ. దీని యజమానులు దీనిని భూదానసమితికి ఇచ్చివేశారు.





పోచంపల్లి గ్రామ కాపురస్థులు
శ్రీ రామచంద్రా రెడ్డిగారు
వీరిచ్చిన భూదానంతోనే భూదానోద్యమం ఆరంభమయింది.





పోచంపల్లి గ్రామస్థులనుద్దేశించి
ఆచార్య వినోబా భావే
ప్రసంగించిన స్థలం
ఇక్కడే భూదానోద్యమం.
ఆరంభమైంది.





పోచంపల్లిలో ఇప్పుడు నిర్మింపనున్న స్మారక స్తంభం వెనుక ఒక ప్రార్థనామందిరం, ఒక సర్వోదయ గ్రంథాలయం, ఒక గ్రామోద్యోగుల శిక్షణ శిబిరం, ఒక అతిథి గృహం, ఉద్యానవనం ఉంటాయి. వినోబాజీతో సంప్రదించిన మీదట దీనియొక్క ప్లాను తుదిపర్యాయంగా రూపొందించబడుతుంది. ఈ స్మారక నిర్మాణం తరతరాల వరకు పవిత్రమైన యాత్రాస్థలంగా, దర్శనీయమైన కేంద్రంగా వర్ధిల్లగలదని తాము ఆశిస్తున్నామని ముఖ్యమంత్రిగారు అన్నారు.

పోచంపల్లి గ్రామాన్ని పూర్వం గాజులపోచంపల్లి అని వ్యవహరించేవారు. ఈ గ్రామంలో ఒకప్పుడు గాజుల పరిశ్రమ మిక్కిలి ఉన్నతదశలో ఉండేది. కాని మునుపటి ఆ గాజుల పరిశ్రమకంటే ఇప్పుడు ఎక్కువ సిరి సంపదలు చేకూర్చి ప్రజలందరికీ సమానంగా సాంఘికన్యాయం ఒనగూర్చగలదని పోచంపల్లి గ్రామస్థులు భావిస్తున్నారు.



పోచంపల్లిలో శ్రీ రామచంద్రారెడ్డిగారి ఇల్లు.

# ★ హైద్రాబాదు రాష్ట్రంలో వన్యమృగముల వేట ★

రచన : దౌలత్ రాయ్
(రాష్ట్ర అడవుల చీఫ్ కన్సర్వేటర్.)

హైద్రాబాదు రాష్ట్రం ప్రకృతిసిద్ధంగా కడు రమణీయమైనది. ఇక్కడ దర్శనీయమైన అడవులు, ఆ అడవులలో వివిధములైన పశు పక్ష్యాదులు కలవు. అతి సుందరమైన కొండలు, కోనలు, సహజసిద్ధమైన సరస్సులు, చెరువులు, కుంటలు రాష్ట్రంలో ఉన్నవి. రాష్ట్ర శీతోష్ణస్థితి సంవత్సరంలో చాలా భాగము ఆహ్లాదకరంగా ఉంటుంది. వేసవికాలంలో గరిష్ఠ ఉష్ణోగ్రత రాష్ట్ర వాయవ్య, మరియు మధ్యభాగములలో ౧౦౮ ఫా. డిగ్రీలవరకు, తూర్పు దక్షిణ భాగాలలో ౧౧౫ ఫా. డిగ్రీల వరకు ఉంటుంది. సగటు వర్షపాతం ఈశాన్యదిశలో ౬౨ అంగుళములు, నైఋతి దిశలో ౨౩ అంగుళములు వుంటుంది. వర్షఋతువు జూన్ నుంచి సెప్టెంబరు ఆఖరువరకు, శీతాకాలం అక్టోబరు నుంచి జనవరి ఆఖరువరకు, వేసవికాలం ఫిబ్రవరి నుంచి మే ఆఖరు వరకు ఉంటాయి.

రాష్ట్ర పూర్వార్థభాగములో వున్న ఆదిలాబాదు, కరీంనగరు, వరంగల్, ఖమ్మం, నిజామాబాదు, మహబూబునగరు జిల్లాలలో చాలాదట్టమైన అడవులుకలవు. వీనిలో కలప, టేకు, వంటచెరుకు సమృద్ధిగా లభిస్తాయి. ఇక్కడ కొన్ని చెట్లు



హైదరాబాదురాష్ట్ర అడవులలో ఇటువంటి పులిపిల్లలు సాధారణంగా ఉంటాయి.

౬౦ నుంచి ౧౦౦ అడుగుల ఎత్తువరకు కూడా ఉంటాయి. అడవులలో శాకాహారమృగములకు, మాంసాహార మృగములకు ఆహారపానీయములు దండిగాలభిస్తాయి. రాష్ట్రమంతటా అనేక చెరువులు, సరస్సులు, కుంటలు, పున్నందువల్ల, వాటిల్లో అన్నిరకాల నీటి కోళ్లు కూడా విశేషంగాఉంటాయి.

హైద్రాబాదు రాష్ట్ర అడవులలో ముఖ్యంగా ఉండే జంతువులు ఇవి: పెద్దపులి, చిఱుతపులి తోడేలు, సివంగి, అడవి కుక్క, ఎలుగు, మనుబోతు, నిల్గాయి, జింక, సాంబారు, నల్లజింక, గోరల్, చింకారా, కుందేలు, మొరిగే జింక, పెద్ద ఉడుత, దుప్పి, అడవిపంది మున్నగునవి.




అడవులలో పచ్చపావురం, మచ్చలపావురం, అడవి పావురం, ఎర్ర అడవికోడి, తాబేలురంగు పావురం, నీలి పావురం, కోలంకిపిట్ట, తిత్తిరిపిట్ట, బూడిదరంగు కౌజు, రక్తవర్ణపు అడవిపెట్ట, నానావిధములైన అడవి కొంగలు, వడ్రంగి పిట్టలు, పెద్ద ఉల్లంకి, ఉల్లాము పిట్ట, అడవిబాతు, నీలిరెక్కల బుడ్డబాతు మొదలగునవి కనిపిస్తాయి.

హైద్రాబాదు ప్రభుత్వ అటవీ శాఖవారు మూడుచోట్ల అంటే పాఖాల (౩౩౯ చ. మై) పోచారం (౫౦ చ. మై.) ఊటునాగారం (౩౧౪ చ. మై.) ప్రాంతములలో వన్యమృగ కేంద్రములను ఏర్పాటుచేశారు. మొదటి రెండు కేంద్రాలు వరంగల్ జిల్లాలోను, మూడవది మెదకు జిల్లాలోను ఉన్నాయి. ఇక్కడ విశ్రాంతి మందిరములు కూడా వున్నాయి.

(తరువాయి ౩౨ వ పుటలో)

# ప్రజారోగ్యశాఖ కార్యకలాపాలు - పంచవర్ష ప్రగతి

## అదనంగా ౨౫౩౪ మంచాలు, ౪౬ ఆసుపత్రుల స్థాపన



గత నాలుగేండ్లలో వైద్యశాఖ కొత్తగా ౪౩ ఆసుపత్రులను, అదనంగా ౨౫౨౪ మంచాలను నెలకొల్పింది. ప్రజారోగ్యంపై ప్రతియేటా ప్రభుత్వం చేస్తున్న ఖర్చు రు. ౬౭ లక్షలు పెరిగింది.

కుష్ఠు, క్షయరోగాల చికిత్స కొరకై ప్రత్యేకంగా కృషి సల్ప బడింది. నర్సులు, మంత్రసానులు, దాయాల శిక్షణ పెద్ద యెత్తున గరపబడుతున్నది. అనేక జిల్లాలలో ప్రసూతి శిశుసంక్షేమ కేంద్రాలు నెలకొల్ప బడినవి.

మారు మూలల్లో వున్న గ్రామాలలో వైద్య సహాయం కొరకై నాలుగు సంచారక వైద్య యూనిట్లు, ౧౯ నమూనా ఆరోగ్య యూనిట్లు, ౧౫౨౬ మందుల పెట్టెలు ఉపయోగింపబడుతున్నవి.

గతఐదేండ్లలో వైద్యప్రజారోగ్యశాఖబడ్జెటు ౧,౨౦,౮౨,౧౮౧ నుంచి ౧,౮౩,౩౪,౯౧౨ రూపాయలకు పెరిగింది. ౧౯౫౪-౫౫ లో పనిచేస్తూ వచ్చిన సాంకేతిక నిపుణుల సంఖ్యలు ఇవి:

| | | ౧౯౫౪—౫౫ |
|---|---|---|
| ౧. ఎక్స్ట్రా కేడర్ ఆఫీసర్లు | .... | ౭ |
| ౨. ఫస్టుక్లాస్ ఆఫీసర్లు | .... | ౫౬ |
| ౩. సెకండ్‌క్లాస్ ఆఫీసర్లు | .... | ౪౭౫ |
| ౪. నర్సింగు ఉద్యోగులు | .... | ౪౧౭ |
| ౫. మంత్రసానులు | .... | ౩౫ |
| ౬. దాయాలు | .... | ౪౬౫ |
| ౭. హెల్తు ఇనస్పెక్టర్లు | .... | ౨౭౪ |
| ౮. హెల్తు విజిటర్లు | .... | ౨౭ |
| ౯. బి. సి. జి. సాంకేతిక నిపుణులు | .... | ౪౧ |

ఈ కాలంలోనే ఆసుపత్రుల సంఖ్య ౧౮౧ నుంచి ౨౨౭ వరకు పెరిగింది. మంచముల సంఖ్య ౨౮౨౧ నుంచి ౫,౩౫౫ వరకు పెరిగింది.

### ౧౯౫౦-౫౧

రాష్ట్రంలో కొత్తగా ఈ క్రింది ఆసుపత్రులు, వైద్య సహాయక సంస్థలు నెలకొల్ప బడినవి:

౧. సరోజినీదేవి ఆసుపత్రి (కన్ను, చెవి, ముక్కు చికిత్సలు)
౨. గోల్కొండ ఆసుపత్రి (దీర్ఘరోగముల చికిత్స)
౩. టి. బి. చికిత్సాకేంద్రం, మోమినాబాదు
౪. తాలూకా కేంద్రాలలో ౪౫ ఆసుపత్రులు
౫. సంచారక నేత్ర చికిత్స ఆసుపత్రి
౬. గుల్బర్గాలో ౩౦ మంచముల పూర్‌ఫండ్ వార్డు
౭. వరంగలు జిల్లా సుబ్లేడులో ఆసుపత్రి
౮. ౫౨ ఆయుర్వేద ఆసుపత్రులు
౯. సికింద్రాబాదులో ఒక క్షయ చికిత్సా కేంద్రం

ఉస్మానియా జనరల్ ఆసుపత్రిలో ఒక బ్లడ్ బ్యాంకు (రక్తం సేకరించి నిలువచేసే కేంద్రం) స్థాపించ బడింది.

ఆదిలాబాదు, బీడ్, ఖమ్మం, మహబూబాబాదు, మక్తైవాడలలో ప్రసూతి వార్డులు తెరువ బడినవి.

నల్లగొండ, పర్బనీ జిల్లా ఆసుపత్రుల స్కీములు, ఎరంసుమా క్షయ ఆసుపత్రి స్కీము సవరించ బడినవి.

నర్సులు, మంత్రసానులు, హెల్తు, విజిటర్లు (ఆరోగ్య పర్య వేక్షకులు) రిజిస్ట్రేషన్ కొరకై ఒక కౌన్సిల్ ఏర్పాటు చేయ బడింది.

౧౯౫౨ లో ఇండియన్ మెడికల్ కౌన్సిల్ వారు ఉస్మానియా విశ్వవిద్యాలయం యొక్క యం. బి. బి. యస్. డిగ్రీకి పరిగణన లభింప జేశారు.

ఉస్మానియా వైద్య కళాశాల పునర్వ్యవస్థీకరించబడింది. జంతు దేహ శాస్త్రం, శారీర శాస్త్రముల విభాగాలు ఉస్మానియా విశ్వవిద్యా లయ ఆవరణలోని విశాలమైన భవనమునకు మార్పుచేయ బడినవి. దీనివలన ఆసుపత్రికి సంబంధించిన విషయముల బోధనకు ఎక్కువ స్థలం లభించింది. ఉస్మానియా ఆసుపత్రి- వైద్య కళాశాల ఈ రెండు సంస్థలను ఒకే అధికారి అజమాయిషీ క్రింద వుంచడం ద్వారా ఆ రెండింటికీ సన్నిహిత సహకారం వుండేటట్లుగా చేయ బడింది.

### ౧౯౫౨—౫౩

ఈ కాలంలో ఈ దిగువ ఆసుపత్రులు నెలకొల్పబడినవి:

సీతాఫల్మండిలో ప్రసూతి వార్డుతో సహా ఒక ఆసుపత్రి పెట్ట బడింది.

ఇదే సంవత్సరంలో ఈ క్రింది ప్రసూతి వార్డుల స్థాపనకు మరియు నిజామాబాదు ఆసుపత్రిలో అదనంగా ౫౦ మంచాలను పెట్టాలనే స్కీముకు మంజూరీ ఇవ్వబడింది.

౧. లాతూరు, ౨. సూర్యాపేట, ౩. గద్వాల, ౪. తాండూరు, ౫. సిద్దిపేట, ౬. బాన్స్వాడా.

ఇంకా అనేక స్థలాలలో ప్రజల విరాళాలతో ప్రసూతి వార్డుల కొరకు భవనములు నిర్మింప బడినవి. వీనిలో యంత్ర పరికరాలు, ఇతర సౌకర్యాలు సమకూర్చడానికై వైద్యశాఖ పూనుకొన్నది.

### ౧౯౫౩—౫౪

వరంగల్లులో త్వరలో తెరువబడనున్న మహాత్మాగాంధీ ఆసుపత్రి నిర్మాణానికి ప్రజలు కొంత విరాళం ఇచ్చారు. ప్రభుత్వం కూడా కొంతడబ్బు ఇచ్చింది ఇందులో జనరల్, మెడికల్ సర్జికల్ వార్డులేగాక దంత, నేత్ర, చెవి, ముక్కు చికిత్సా విభాగాలు ఏర్పాటు చేయడానికి కూడా వసతి ఏర్పరచ బడింది.

సంగారెడ్డి నాందేడులలో ఆసుపత్రులకు కొత్తగా భవనములు నిర్మింప బడినవి. వికారాబాదు క్షయ చికిత్సా శానిటోరియంలో మంచముల వసతి హెచ్చింప బడింది.

గద్వాలలో శ్రీమతి ఓ. కేశమ్మ విరాళంగాఇచ్చిన ౧౦ వేల రూ.ల ఖరీదుచేసే ఔట్ పేషంట్ ఆసుపత్రి నిర్మాణం పూర్తిచేయబడింది.

ఉద్గీర్, పర్భణి, ధారూర్, మంచిర్యాలల్లో నాలుగు ఆసుపత్రులు నెలకొల్ప బడినవి.

భోనగిరి, దేవరకొండ, చిట్గోప, జగిత్యాలల్లో ప్రసూతి వార్డులు నెలకొల్పటానికి మంజూరి ఇవ్వబడింది.

ఉస్మానియా ఆసుపత్రిలో కొత్తగా కట్టబడిన నర్సుల నివాస గృహాల నిర్వహణకై అదనపు సిబ్బంది ఏర్పాటు చేయబడింది.

అదనంగా ఆరుగురు గె. వైద్యాధికారుల పదవులు సృష్టింప బడినవి.

ఈ క్రింది ఆసుపత్రులలో సంస్థలలో ఎక్కువ మంది ఉద్యోగులు మరియు సాదరు ఖర్చు కావలెనని తెలియజేయ బడిన కోర్కెకు అనుగుణంగా వాటి స్కీములు సవరించ బడినవి :

౧. విక్టోరియా జనానా ఆసుపత్రి
౨. కె. ఇ. యం. ఆసుపత్రి
౩. చెవి, ముక్కు, గొంతు ఆసుపత్రి
౪. ఎర్రంనుమా టి. బి. ఆసుపత్రి
౫. మెడికల్ స్టోర్సు
౬. పిచ్చి ఆసుపత్రి
౭. సంచార నేత్ర చికిత్సా కేంద్రం
౮. వరంగలు ఆసుపత్రి

### ౧౯౫౪—౫౫

ఈ సంవత్సరంలో హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో కొత్తగా క్షయరోగ గృహ చికిత్సా పథకం ప్రారంభింప బడింది. ఈరెండు నగరాలు ఆరు ప్రాంతాలుగా విభజింపబడినవి. ఒక్కొక్క ప్రాంతానికి ఒక వైద్యాధికారి నియమింప బడినాడు. క్షయరోగిని ఆవ్యాధి నిపుణుడు టి. బి. ఆసుపత్రి లేక టి. బి. క్లినిక్‌లో పరీక్షించి అతనికి చికిత్సా విధానాన్ని నిర్ణయించిన తరువాత అతడికి అతని ఇంటిలోనే నిపుణుడు నిర్ణయించిన విధంగా చికిత్స లభింప జేసేందుకై పైన పేర్కొనబడిన ఒక వైద్యాధికారికి ఆకేసు అప్పగించ బడుతుంది. ఈ సంవత్సరం ౩,౪౬౨ మంది రోగులకు ఇలా చికిత్స చేయబడింది. ఎక్కువమంది రోగులుండడంచేత వైద్యాధికారుల సంఖ్య ౧౨ కు పెంచబడింది.

## క్షయ రోగులకు కొలాప్స్ థెరాపీ

ఇంతవరకు కొలాప్స్ థెరాపీ అవసరమైన క్షయరోగులు ఎర్రంనుమా క్షయ ఆసుపత్రికి పంపబడేవారు. అక్కడ వారికి ౧౨ మంచాలు రిజర్వు చేయబడి యున్నవి. అయితే అంతకంటె ఎక్కువమంది రోగులు వస్తే చేర్చుకొనే అవకాశం వుండదుగనుక అటువంటి వారి సౌకర్యం కొరకై లింగంపల్లిలోని అంటు రోగముల ఆసుపత్రిలో ౫౦ మంచాలు ఏర్పాటుచేయడానికి ప్రభుత్వం మంజూరి ఇచ్చింది.

## రోగుల ఆహారానికి అదనపు కేటాయింపు

రాష్ట్రంలోని వివిధ ఆసుపత్రులలోవుండే రోగుల ఆహారం కొరకై ప్రభుత్వం అదనంగా రెండు లక్షల రూ. ల అవృత్త వ్యయాన్ని మంజూరు చేసింది.

## మందుల కొనుగోలుకు అదనపు కేటాయింపు

రోగుల సంఖ్య ఎక్కువవుతున్నది కాబట్టి మందుల కొనుగోలు కొరకై అలోపతి ఆసుపత్రులకు రు. ౯౦,౦౦౦ లు, ఆయుర్వేద ఆసుపత్రులకు రు. ౧౦,౦౦౦ లు ప్రభుత్వం మంజూరు చేసింది.

## రేడియోగ్రఫీ స్కీము

చవుక రేట్లపై భారీ యెత్తున ఎక్సురే ఫొటోలు తీయడం కొరకై ౧౯౫౪-౫౫ లో రు. ౩౦,౫౨౫ ల అవృత్త వ్యయంలో మాస్ మీనియేచర్ రేడియోగ్రఫీ స్కీము మంజూరు చేయబడింది. ఇందుకవసరమైన యంత్ర సామగ్రిని కొనడానికి అఖిలభారత క్షయరోగ నిరోధక సంఘంవారు టి. బి. సీల్లు అమ్మి ఆడబ్బును విరాళంగా ఇచ్చారు.

## యూసుఫ్‌గూడా పేరక్స్ క్షయ ఆసుపత్రి

౧౦౦ గురు క్షయరోగులకు చికిత్స చేయుట కొరకై యూసుఫ్ గూడాలో ఒక టి. బి. ఆసుపత్రిని నెలకొల్పడానికై రు. ౩౦,౬౨౬ ఆవృత్త వ్యయంతో ఒక స్కీము మంజూరు చేయబడింది.

## కొత్త ఆసుపత్రులు

పర్భనీజిల్లా బౌంఫ్‌లోను, కరీంనగర్ జిల్లాలో మహదేవపూరు, జమ్మికుంటలలో మొత్తం మూడు ఆసుపత్రులు పెట్టబడినవి.

## మోమినాబాదు టి. బి. శానిటోరియంలో ఎలక్ట్రిక్ జెనరేటింగ్ సెట్లకు ఉద్యోగుల నియామకం

మోమినాబాదు క్షయ ఆసుపత్రిలో జెనరేటింగ్ సెట్ల నిర్వహణ కొరకై అవసరమైన ఉద్యోగులు నియమింపబడినారు.

## శాసన సభ్యుల వసతి కేంద్రంలో ఆసుపత్రి

యం. యల్. ఏ. క్వార్టర్సులోని ఆసుపత్రిలో యం. యల్. ఏ. లకే గాక నారాయణగూడ, హిమాయత్‌నగర్ ఇంకా పరిసర ప్రాంతాల ప్రజలకు కూడా వైద్య సహాయం లభింపజేయడానికై ౧౯౫౪-౫౫ లో అదనంగా మరికొందరు ఉద్యోగులు నియమింప బడినారు. సాదిర్ ఖర్చుకూడా మంజూరు చేయబడింది. దీనికి "హిమాయత్‌నగర్ ఆసుపత్రి" అని పేరుపెట్టబడింది.

### ౧౯౫౫—౫౬

### రేడియం ఇన్‌స్టిట్యూట్

రేడియం ఇన్‌స్టిట్యూట్ నిర్మాణం కొరకు, రేడియమును కొన దానికి భారత సాంఘిక సేవా మహాసభ హైదరాబాదు శాఖవారు రాఫిల్ టిక్కెట్లు అమ్మి ౬,౧౨,౦౦౦ లు, విరాళాలద్వారా రు. ౫,౬౦,౦౦౦ సేకరించారు. ఈ భవనం యొక్క క్రిందిభాగం నిర్మాణం పూర్తి అయింది. రేడియమ్ కూడా చేరింది. రేడియమ్ ఇన్‌స్టిట్యూట్ మరియు కేన్సర్ ఆసుపత్రి కొరకు ఆవృత్త పద్ధతిపై ప్రభుత్వం ౧,౫౦,౦౦౦ రూపాయలు మంజూరు చేసింది. ఈ ఇన్‌స్టిట్యూట్ ౧౯౫౫ ఆగష్టు ౧౫ తేదీన తెరువబడింది.

### ఖమ్మంజిల్లా ఆసుపత్రి :

ఖమ్మం ఆసుపత్రిని ఇతర జిల్లా కేంద్రాల ఆసుపత్రుల స్థాయికి తేవడానికై ప్రభుత్వం సాలీనా రు. ౩౦,౦౦౦ ఆవృత్తివ్యయం మంజూరు చేసింది. కొత్తగా ఏర్పాటుచేయబడిన ఈ జిల్లా ఆసుపత్రిని ఒక సివిల్ సర్జన్ ఆధ్వర్యం క్రింద పెట్టడమైనది. ఈయనే జిల్లా ఆరోగ్యశాఖాధికారిగా కూడా వ్యవహరిస్తున్నారు.

### కొత్త ఆయుర్వేద ఆసుపత్రుల స్థాపన :

గ్రామీణ ప్రాంతాలలో మరి ఆరు ఆయుర్వేద ఆసుపత్రులను నెలకొల్పడానికై ప్రభుత్వం ఒక స్కీము మంజూరు చేసింది.

### ఎక్సురే యంత్రాలు, ఇతర పరికరాలు :

నగరంలోని ఆసుపత్రులలోను, జిల్లా ఆసుపత్రులలోను ఎక్సురే యంత్రాలు, ఇతర పరికరాలు పెట్టడానికై ప్రభుత్వం రు. ౧,౫౦,౦౦౦ ల ఆవృత్త వ్యయం మంజూరు చేసింది.

### ఇతర స్కీములు :

ఈ క్రింది ప్రతిపాదనలను ప్రభుత్వం పరిశీలిస్తున్నది :

| | ఏర్పాటుచేయబడిన మొత్తం |
|---|---|
| ౧. ఉస్మానియా జనరల్ ఆసుపత్రి పునర్వ్యవస్థీకరణ | రు ౧,౦౦,౦౦౦ |
| ౨. జిల్లాలలో క్షయరోగి గృహచికిత్స పథకం | ౧,౦౦,౦౦౦ |
| ౩. మహాత్మాగాంధీ ఆసుపత్రి, వరంగల్లు | ౮౨,౦౦౦ |
| ౪. పరికరములు, యంత్రాలు-అనావృత్తవ్యయం | ౨,౫౦,౦౦౦ |

### వైద్య విద్య :

వైద్య కళాశాలలో విద్యార్థుల ప్రవేశ సంఖ్య ౧౯౫౦ లో ౭౦ అయితే ౧౯౫౫ లో ఆ సంఖ్య ౧౦౦ వరకు హెచ్చింప బడింది. అంతే పట్టభద్రానంతర కోర్సులైన యం. డి., యం. యస్. వగైరా కోర్సులు కూడా ప్రవేశపెట్ట బడినవి.

### కార్మికుల ప్రభుత్వ భీమా ప్రణాళిక :

హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలోను, నగర పరిసరాలలోను ౧౯౫౫ ఏప్రిల్ ౨౫ తేదీన యూనియన్ ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రిణిచే కార్మికుల ప్రభుత్వ భీమా ప్రణాళికకు ప్రారంభోత్సవం చేయబడింది. ఈ స్కీము ౧౭౦౦౦ మందికి పైగా వున్న ఫ్యాక్టరీ కార్మికులకు వైద్య సహాయం లభింపజేస్తుంది. వీరంతా శాశ్వత కర్మాగారాలలో పనిచేస్తున్నవారు. దీనికయ్యే ఆవృత్త వ్యయాన్ని, అనావృత్త వ్యయాన్ని, హైదరాబాదు ప్రభుత్వమూ, కేంద్ర ప్రభుత్వమూ వరుస వారీగా ౧ : ౩ నిష్పత్తి చొప్పున భరిస్తాయి. ఈ స్కీముకు సాలీనా ఒకటిన్నర లక్షలు ఖర్చు అవుతాయి.

## ౨. ప్రజారోగ్యం

### ౧. అంటువ్యాధులను అరికట్టడం :

౧. ప్లేగు : స్పెషల్ ప్లేగు డిపార్టుమెంటు వారి కృషి మూలకంగా రాష్ట్రంనుంచి ప్లేగువ్యాధి పూర్తిగా నిర్మూలింప బడింది.

౨. *కలరా :* జాతరలు, ఉర్సులు, ఇతర ఉత్సవాల సందర్భము లలో పరిశుభ్రమైన మంచినీటి సరఫరా చక్కని పారిశుద్ధ్య వసతుల ఏర్పాట్లవల్ల కలరావ్యాధి చాలావరకు తగ్గిపోయింది. జాతీయ నీటి సరఫరా మరియు పారిశుద్ధ్య కార్యక్రమం క్రింద హైదరాబాదు రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో నీటి సరఫరా పారిశుద్ధ్య స్కీములను అమలు పరచేందుకై భారత ప్రభుత్వం మూడున్నర లక్షల రూ. లను మంజూరు చేసింది. ఈ స్కీములను స్థానిక పరిపాలనా శాఖవారు అమలు పరుస్తారు. రెండవ పంచవర్ష ప్రణాళికలో యీకార్యక్రమం ఇంకా విస్తృతం చేయబడుతుంది.

౩. *మశూచికం :* ఈ వ్యాధి టీకాలు పెద్ద పెట్టున వేయడం వల్ల ఇది చాలావరకు తగ్గిపోయింది. రాష్ట్రంలో ప్రతియేటా సగటున ౧౦ లక్షల మశూచికం టీకాలు వేయబడుతున్నవి.

౪. *బి. సి. జి. టీకాల ఉద్యమం :* ౧౯౫౩ సంవత్సరంలో బి. సి. జి. టీకాల ఉద్యమం ప్రపంచ ఆరోగ్యసంస్థ మరియు ఐక్య రాజ్య సమితి అంతర్జాతీయ బాలసంక్షేమ నిధి అను సంస్థయొక్క సహకారంతో హైదరాబాదు సికిందరాబాదు నగరాలలో ప్రారంభింప బడింది. ఇప్పుడీ ఉద్యమం నిజామాబాదు, మెదక్, మహబూబ్‌నగర్, రాయచూరు, ఖమ్మం జిల్లాలలో కూడా ప్రారంభింప బడింది. ఈ ఉద్యమంపై ప్రభుత్వం యేటా రు. ౨,౩౮,౪౦౦ లు ఖర్చు పెడుతున్నది.

ఇంతవరకు ౩౨,౪౦,౧౧౯ మంది వ్యక్తులు పరీక్షింపబడి ౮,౩౫,౧౨౨ మంది వ్యక్తులు బి. సి. జి. టీకాలు వేయబడినారు. వచ్చే రెండు మూడేండ్లలో ఇరవైయేండ్లలోపు వయస్సులో ఉన్న వారందరికీ ఈ టీకాలువేసి క్షయవ్యాధినుండి వారిని సంరక్షింప వలెనని తలపెట్టబడింది.

౫. *కుష్ఠువ్యాధి :* రాష్ట్రంలోని ఆసుపత్రులు పన్నిటిలో కుష్ఠురోగ చికిత్సా కేంద్రాలు పెట్టబడినవి. ప్రభుత్వం రెండు కుష్ఠురోగ చికిత్సా కేంద్రాలను నెలకొల్పడానికి మంజూరీ ఇచ్చింది. ఈ రెండూ సాలీనా రు. ౬౯,౫౭౨ ల ఆవృత్త వ్యయంతో ౧౯౫౫ మార్చి ౧వ తేదీ నుంచి ఉస్మానియా, మహబూబ్‌నగర్ జిల్లాలలో నెలకొల్పబడినవి. మిగిలిన అనావృత్త వ్యయాన్నంతా కేంద్ర ప్రభుత్వమే భరిస్తుంది. ఆవృత్త వ్యయాన్ని కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు ఉజ్జాయింపుగా పంచుకుంటాయి.

ఉస్మానాబాదులోను, బీదర్ జిల్లాలోని వథోనాలోను రెండు కుష్ఠుకాలనీలు నెలకొల్ప బడినవి. ఈ విధంగా కుష్ఠురోగుల కాలనీలు ఇప్పుడీ రాష్ట్రంలో నాలుగున్నవి.

౬. జహీరాబాదు కుష్ఠురోగ కాలనీకి ప్రతి సంవత్సరం రు. ౬,౪౨౯ ల గ్రాంటు ఇవ్వబడుతున్నది.

౭. శాసనసభలో హైద్రాబాదు కుష్ఠురోగ చట్టం ఆమోదింప బడింది.

౨. *మలేరియా నిరోధక పథకం :*

మలేరియా నిరోధక చర్యల కార్యక్రమాలన్నీ నేషనల్ మలేరియా కంట్రోల్ యూనిట్ల ఆధ్వర్యంక్రిందికి తీసుకొని రాబడినవి. రాష్ట్రంలో ఇప్పుడు ఇట్టివి ౬ యూనిట్లు పనిచేస్తున్నవి. వేరుపరచ బడిన ప్రాంతాలకు ప్రత్యేకంగా కొన్ని పథకములు కూడా తయారు చేయ బడినవి. ఈ పథకము మొత్తమును అమలు పరచుటకు రాష్ట్ర ప్రభుత్వానికి సాలుకు రు. ౯,౩౯,౨౯౪ ల ఖర్చు అవుతుంది. ప్రపంచ ఆరోగ్య సంస్థవారు, ఐక్యరాజ్యసమితియొక్క అంతర్జాతీయ పిల్లల అత్యవసర నిధివారు ౩౦ లక్షల రు. ల విలువ చేయు వైద్య పరికరములు, రవాణా పరికరములు, డి. డి. టి మందు సరఫరాచేశారు.

ఇంతవరకు మలేరియా విపరీతంగా గల ప్రాంతాలలో ఆవ్యాధి చాలా వరకు అరికట్టబడింది. ఇతర ప్రాంతాలలో ఇది పూర్తిగా అణచివేయ బడుతున్నది. సికింద్రాబాదులోని పాత బేగంపేట ఆసుపత్రి భవనములను స్వాధీన పరచుకొని, వాటిల్లో కేంద్ర మలేరియా సంస్థను నెలకొల్పుటకు ప్రభుత్వం తీవ్రంగా సమాలోచిస్తున్నది. పాతబేగంపేటఆసుపత్రిలో సర్ రోనాల్డు అను సుప్రసిద్ధ మలేరియా పరిశోధకుడు పరిశోధనచేసి అనోఫిలైస్ అను ఆడ దోమలు కాటువేసినట్లయితే మలేరియా వ్యాధి వ్యాపిస్తుందని కనుగొన్నాడు. వచ్చే రెండు మూడేండ్లలో మలేరియావ్యాధి రాష్ట్రంలో పూర్తిగా రూపుమాసి పోగలదని ఆశింపబడుతున్నది.

౩. *యాస్ వ్యాధి నిరోధక పథకం :*

యాస్ అను వ్యాధి వరంగల్, కరీంనగర్, ఆదిలాబాదు జిల్లాలలోని అడవులలో నివసించు ఆదిమ జాతులవారికి సాధారణంగా వస్తూవుంటుంది. ప్రపంచ ఆరోగ్య సంస్థవారు, ఐక్యరాజ్య సమితి యొక్క అంతర్జాతీయ పిల్లల అత్యవసర నిధివారు చేసిన సహాయంతో ౧౯౫౩ ఆగష్టునుంచి ఈజిల్లాలో యాస్ నిరోధకఉద్యమం ఆరంభింప బడింది ప్రస్తుతం ౪ జట్లు కరీంనగరు జిల్లాలో పనిచేస్తున్నవి. వైద్యశాఖవారు ఈ ఉద్యమానికై సాలీనా రూ. ౮౦,౧౨౮ లు ఖర్చుపెడుతున్నారు. ఇంతవరకు ౧,౧౪,౫౩౦ మంది యాస్ రోగులు పరీక్ష చేయబడినారు. వారిలో ౮౪౫౬ మంది చికిత్సపొందినారు ఈ వ్యాధి వచ్చే రెండు మూడేండ్లలో రాష్ట్రంనుంచి సమూలంగా తుడిచిపెట్టబడుతుందని ఆశించబడుతున్నది.

౪. *ఫైలేరియాసిస్ నిరోధక పథకం :*

ఈ వ్యాధి ౫ జిల్లాలలో అంటువ్యాధిగా ఉన్నది. కరీంనగరు జిల్లా మానేరులో ఈవ్యాధిని అరికట్టుటకు కృషిచేయబడుతున్నది. ఈ పథకానికి సాలీనా రూ. ౨౦,౦౦౦ లు ఖర్చవుతున్నది. పథకం వల్ల సుమారు ౩౦౦౦౦ మంది ప్రజలకు మేలు చేకూరుతున్నది.

## ౩. ప్రసూతి మరియు శిశు ఆరోగ్య సేవాకేంద్రములు

౧. గ్రామసీమలలో ప్రసూతి, మరియు శిశు ఆరోగ్య సంక్షేమ కేంద్రములు, ఉపకేంద్రములు ఎక్కువగా తెరువబడుతున్నవి. ఇవేగాక జిల్లా తాలూకా ప్రధాన కేంద్రములలో కొత్తగా ప్రసూతి గృహములు తెరవడం, వాటిల్లో మంచముల సంఖ్య పెంచడం, ప్రస్తుతంవున్న ప్రసూతి గృహములు, ఆసుపత్రులలో అదనంగా ప్రసూతి వార్డులు చేర్చడం, ఈ కృషి ఫలితంగా ప్రసూతి, మరియు శిశుసంక్షేమ కేంద్రముల సంఖ్య ఎక్కువవుతున్నది. ప్రస్తుతం ప్రసూతి మరియు శిశుఆరోగ్య కేంద్రములు ౪౯, వీటి ఉపకేంద్రములు ౩౫, శిశుసంక్షేమ కేంద్రములు ౩౦ వున్నాయి.

౨. *నర్సులకు శిక్షణ* : ఉస్మానియా కె. ఇ. యం. ఆసుపత్రులలో నర్సుల శిక్షణకేంద్రములు పెంచబడినవి. శిక్షణపొందు నర్సులసంఖ్య పెంచబడింది. ప్రస్తుతానికి ౧౩ మంది నర్సులు మాత్రం శిక్షణ పొందుతున్నారు. ప్రసూతి, మరియు శిశు ఆరోగ్య పథకం క్రింద మరొక ౨౦ మంది అభ్యర్థినులు శిక్షణ పొందుతున్నారు. నర్సులుగా శిక్షణ పొందుటకు చాలామంది ముందుకు రాకపోవడం వల్ల యోగ్యతగల అభ్యర్థినులను పొందడంలో చాలా ఇబ్బందులు కలుగుతున్నవి.

౩. *హెల్తు విజిటర్లకు శిక్షణ* : వైద్యశాఖవారు నిలోఫర్ ఆరోగ్య పాఠశాలను స్వాధీనం చేసుకొని దానిని పునర్వ్యవస్థీకరించారు. ప్రస్తుతం హైద్రాబాదు ప్రభుత్వం చేసిన ఏర్పాట్ల ప్రకారం ఈ పాఠశాలలో ౨౦ మంది విద్యార్థులు మరియు కేంద్ర ప్రభుత్వపు ఏర్పాట్ల ప్రకారం ౬౦ మంది విద్యార్థులు చేర్చుకోబడినారు.

౪. *మంత్రసానులు, దాయాలకు శిక్షణ* : ప్రసూతి, మరియు శిశుఆరోగ్య కార్యక్రమం క్రింద ౫౪ మంది మంత్రసానులకు శిక్షణ ఇచ్చుటకు ఏర్పాట్లు చేయబడినవి. కేంద్ర ప్రభుత్వ సహాయంతో మరొక ౩౦ మంది, మంత్రసానులకు, 80 మందిసహాయకి నర్సు మంత్రసానులకు, ౩౦౦ మంది గ్రామీణ దాయాలకు శిక్షణ ఇచ్చుటకు కూడా ఏర్పాట్లు చేయబడినవి.

౫. *నిలోఫర్ ఆసుపత్రి* : నగరంలో దాయాలకు, హెల్తు విజిటర్లకు శిక్షణ ఇచ్చుటకు ఇది ప్రధాన కేంద్రముగా ఉన్నది. ౧౯౫౨-౫౩ సం. లో ప్రసూతి గృహంలో ౫౦ మంచములు, పిల్లలకు ౫౦ మంచములు, మొత్తం ౧౦౦ మంచములు గల ఒక ఆసుపత్రి తెరువబడింది. ఈ మంచముల సంఖ్య ౧౯౫౫ సం.లో ౧౫౦ వరకు పెంచబడింది.

౬. *హైద్రాబాదు మహిళలు, మరియు పిల్లల వైద్య సహాయక సంస్థ* : హైద్రాబాదులో పదేండ్ల క్రిందట ఈ సంస్థ స్వచ్ఛంద స్థాయిపై నెలకొల్ప బడింది. ప్రభుత్వం ఇచ్చిన సహాయంతోను, ఈ సంస్థ సభ్యులు, తదితరులు ఉదార పూర్వకంగా ఇచ్చిన విరాళాలు, చందాలతోను ప్రసూతి మరియు శిశుసంక్షేమ రంగంలో ఇది చాలా కృషిచేసింది. కాని, ఈ సంస్థకు నిధులు చాలకపోవడం వల్ల, దానిని ప్రభుత్వమే నడిపించవలెనని కోరబడింది. తదనుగుణంగా ప్రభుత్వం నిలోఫర్ ఆసుపత్రితో పాటుగా మరి ఆ సంస్థలను వైద్యసహాయక సంస్థనుంచి తీసుకొనినది.

అ. *నిలోఫర్ ఆసుపత్రి* : ఈ భవన నిర్మాణానికి ౩౫ లక్షలు ఖర్చవుతుంది.

ఆ. *నిలోఫర్ ఆరోగ్య పాఠశాల* : ఈ సంస్థలో ప్రతి సంవత్సరం ౧౫ మంది హెల్తు విజిటర్లు శిక్షణ పొందుతారు. ప్రభుత్వం ఈ స్కూలును తన స్వాధీనంలోకి తీసుకొన్న తరువాత ఎక్కువ మంది అభ్యర్థులకు శిక్షణ ఇచ్చుటకు ఏర్పాట్లు చేసింది. ఈ స్కూలుకు సాలీనా రు. ౩౩,౩౬౭ లు ఖర్చు అవుతుంది.

ఇ. *సుఖరోగముల చికిత్సా కేంద్రం* : ఈ కేంద్రంలో వివిధ పిల్లల సంక్షేమ కేంద్రములకు పోవు పిల్లల తల్లులు పరీక్ష చేయబడుతారు. వారికి వారి భర్తలకు ఈ కేంద్రంలో సుఖరోగములకు చికిత్స చేయబడుతుంది. ఇక్కడ నాలుగు ప్రసూతి మంచములు కూడా ఏర్పాటు చేయబడినవి. దీనికి సాలీనా రూ. ౩౩,౩౬౭ లు ఖర్చు అవుతుంది.

ఈ. *ఐదు శిశుసంక్షేమ కేంద్రములు* : ఈ పథకం క్రింద హైద్రాబాదు నగరంలో ౪, హైద్రాబాదు జిల్లాలో కిషెదాన్ట్రో ౧, మొత్తం ౫ శిశు సంక్షేమ కేంద్రములు పనిచేస్తున్నవి. వీటి క్రింద ౧౫ ఉపకేంద్రములు కూడా ఉన్నవి.

ఉ. *ఉస్మానాబాదులో ౪ ప్రసూతి కేంద్రములకు పథకం* : ౧౯౫౧ సం. లో ఉస్మానాబాదు జిల్లాలో అనాథ స్త్రీలకు సహాయపడుటకై ఒక సంవత్సరం కొరకు ౭ ప్రసూతి, ఆరోగ్య కేంద్రములు నెలకొల్పబడినవి. ఇందుకైన ఖర్చంతా హోంశాఖ పునరావాస నిధినుంచి భరించనైనది. ఆ తరువాత ప్రజారోగ్యశాఖవారు ఈ కేంద్రములను తమ అధ్వర్యం క్రిందికి తీసుకొన్నారు. ఈ పథకానికి సాలీనా రూ. ౨౪,౨౫౮ లు ఖర్చవుతుంది.

## ౪. గ్రామీణ వైద్యసహాయం

౧. *నమూనా వైద్య ఆరోగ్య యూనిట్లు* : గత మూడు సంవత్సరాలలో మెదకు జిల్లా పటన్ చెరువులోను, ఔరంగాబాదు జిల్లా సిల్లోడ్‌లోను, బీదర్ జిల్లా చిట్గోపాలోను మొత్తం మూడు నమూనా వైద్య ఆరోగ్య యూనిట్లు స్థాపించబడినవి. ప్రతి యూనిట్ క్రిందను సుమారు ౪౦ వేల జనాభాగల ౩౦ గ్రామాలకు వైద్యసహాయం లభిస్తుంది. ఈగ్రామాలన్నీ ప్రధానకేంద్రానికి ౭ లేక ౮ మైళ్ళ వ్యాసార్థ దూరంలో ఉంటాయి. వీటికి లభించు వైద్య సౌకర్యములు యివి :

౧. వైద్యసహాయం, ౨. ప్రసూతి, శిశుసంక్షేమము. వీటిలో మంత్రసానులు, దాయాలకు శిక్షణ ఇవ్వబడుతుంది. ౩. ప్రజారోగ్య సేవ. ౪. ఆరోగ్య విద్య. ౫. అంబులెన్సు సర్వీసు.

పై ఆరోగ్య వైద్య యూనిట్లుగాక మరొక ౧౭ యూనిట్లు కూడా ఇటీవలెనే మంజూరు అయినవి.

౨. *గ్రామీణ మందుపెట్టెలు :* రాష్ట్రంలో మొత్తంమీద ౧౫౨౬ మందుపెట్టెలు పనిచేస్తున్నవి. సమీపంలో ఆసుపత్రి సౌకర్యాలులేని గ్రామాలకు ఈ మందు పెట్టెలు చాలా సహాయపడుతున్నవి. ప్రతి మందుపెట్టెలో చిన్న చిన్న రోగాల నివారణ కుపకరించు మందు లుంటాయి. వాటిని ఏ రోగములకు ఏవిధంగా ఉపయోగించవలెనో తెలియజేయుటకు స్థానిక భాషలలో వ్రాయబడిన సూచనలు గల పత్రములు ఆ పెట్టెలలో ఉంటాయి. ఈ మందుల పెట్టెలు గ్రామాలలో ముఖ్యంగా సాంఘిక కార్యకర్తలకుగానీ లేక ఉపాధ్యాయులకుగానీ వప్పగించబడుతాయి. ఈ పెట్టెలను ఉపయోగించే విషయమై వారికి ఒక వారం రోజులు వరకు శిక్షణ ఇవ్వబడుతుంది. చికిత్స ఉచితంగానే చేయబడుతుంది.

౩. *సంచారకయూనిట్లు :* ౧౯౫౧-౫౨ సం. లో వరంగల్, కరీంనగరు, మెదకు, నల్గొండ జిల్లాలలో ౪ సంచారక వైద్య, ఆరోగ్య యూనిట్లు నెలకొల్పబడినవి. ప్రతియూనిట్ క్రింద రాకపోకల సౌకర్యాలకు మోటారుకార్లు, ఇతర వాహనములు, ఒక వైద్యశాఖాధికారి, ఒక హెల్తు ఇనస్పెక్టర్ పనిచేస్తారు. ఈ యూనిట్లు, గ్రామీణ ప్రాంతాలలో రోగనివారణ, నిరోధకచర్యలు గైకొంటాయి.

## ౫. జనన మరణముల రిజిస్ట్రేషన్ కార్యాలయం

౧. ప్రజారోగ్యశాఖ సక్రమంగాను, విజయవంతంగాను పని చేయాలంటే జనన మరణముల లెక్కల వివరములు తెలియడం అవసరం. అందుకని జననమరణములు, వివాహములు, నమోదు చేయు రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయం ఒకటి తెరువబడింది. ఇది ౧౯౫౫ జనవరి నుంచి పనిచేస్తున్నది. దీనికి సాలీనా రూ. ౮౦,౫౪౨ లు ఖర్చు అవుతుంది. చాలా ముఖ్యమైన లెక్కల వివరములు ఈ కార్యాలయంలో నమోదుచేయబడుతాయి.

౨. *అంటువ్యాధుల కంట్రోలు :* ఈ శాఖ అంటువ్యాధుల నిరోధానికి అవసరమైన చర్యలన్నీ గైకొంటుంది.

## ౬. పరిసర ప్రాంతాల పారిశుద్ధ్యం

పరిసర ప్రాంతాలను పరిశుభ్రంగా ఉంచుటకు గాను ఒక శాఖ తెరువబడింది. ఇది యోగ్యతగల అసిస్టెంటు పబ్లిక్ హెల్తు ఇంజనీర్ క్రింద పనిచేస్తుంది. దీనికి సాలీనా రూ. ౨౧,౪౦౯ లు ఖర్చు అవుతుంది. ఈ శాఖ మునిసిపాలిటీలు, టౌన్ కమిటీలు, జిల్లా బోర్డులవంటి స్థానిక సంఘములకు, నీటిసరఫరా, మురుగుకాలువలు, గృహనిర్మాణం మున్నగు సమస్యలను గూర్చి సలహాలిస్తుంది.

## ౭. ఆరోగ్య విద్య, ప్రచారశాఖ

ఈ శాఖ చలనచిత్రములు, రేడియో, వార్తా విశేషాలు, ముద్రిత సాహిత్యం, ప్రదర్శనములు, ప్రత్యేక ఉద్యమములు మున్నగు వాటి ద్వారా ప్రజలలో ఆరోగ్య ప్రచారం చేస్తున్నది.

ఈ శాఖలో ఒక సినిమాకారు వున్నది. ఈకారు ఫిల్ములు, ప్రొజక్టర్లు, జనరేటర్లు, మున్నగు వాటితోపాటు జిల్లాలో పర్యటిస్తుంది. దీని సహాయంతో గ్రామస్థులకు ఆరోగ్య విషయాలు తెలియజేయ బడుతాయి. సినిమాకారు వెంట ఒక వైద్య శాఖాధికారి, ఒక హెల్త్ ఇనస్పెక్టరు కూడా వుంటారు.

హైద్రాబాదులో ఒక ఆరోగ్య వస్తు ప్రదర్శనశాల వుంది. ఇది ప్రాచ్యదేశములన్నిట్లో కెల్ల చాలా శ్రేష్ఠమైనదని పేరుగాంచినది. అదనంగా నమూనా వస్తువులు, ప్రదర్శనములు మున్నగునవి చేర్చడంద్వారా ఈ వస్తుప్రదర్శనశాల విస్తృతం చేయబడింది. ప్రజలకు స్థానిక భాషలలో ఆరోగ్యము, పారిశుద్ధ్యము మున్నగు విషయములను వివరించి చెప్పుటకుగాను ఈ ప్రదర్శనశాలకు ముగ్గురు హెల్త్ ఇనస్పెక్టర్లు డెప్యూట్ చేయబడినారు. హెల్త్ మ్యూజియం ఒక శిక్షణ కేంద్రముగాకూడా పనిచేస్తున్నది. అందులో ఒక సినిమాహాలు ఒక లైబ్రరీకూడా ఉన్నాయి. దీనిని చూచుటకు నెలకు సుమారు ౨౫ వేలమంది ప్రజలు వస్తారు.

ఈ శాఖ అధ్వర్యాన నడుస్తున్న ప్రజారోగ్య సంస్థలో ప్రతి సంవత్సరం ౬౦ మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వబడుతుంది.

## ౮. ఆహార పరిశోధనశాఖ

హైదరాబాదు రాష్ట్రంలో అనేక జిల్లాలలో ఆహారము విషయమై చాలా పరిశోధనలు చేయబడినవి. ఆసుపత్రులకు, హాస్టళ్ళకు, ఇతర సంస్థలకు, అనువైన ఆహారములు సిఫారసు చేయబడినవి. ఐక్యరాజ్య సమితియొక్క అంతర్జాతీయ పిల్లల అత్యవసర నిధినుంచి సరఫరా చేయబడిన పాలపొడి స్కూలు పిల్లలకు గర్భిణీస్త్రీలకు విశేషంగా సరఫరా చేయబడుతున్నది.

## ౯. స్కూలు విద్యార్థులకు వైద్య పరీక్ష

స్కూలుకు పోవు విద్యార్థులను వైద్యపరీక్షచేయుటకు సౌకర్యాలు కల్పించబడినవి. హైదరాబాదు సికింద్రాబాదు నగరాలలో ౭ మంది వైద్యశాఖాధికారులు, వైద్యశాఖాధికారిణులు గల రెండు చికిత్సాలయములు పనిచేస్తున్నవి. జిల్లాలు, తాలూకాలలో అక్కడి ఆసుపత్రుల వైద్య శాఖాధికారులు, ప్రభుత్వము. మరియు ప్రయివేటు స్కూళ్లలో చదువు విద్యార్థినులను అప్పుడప్పుడు వైద్యపరీక్ష చేస్తారు.

స్కూలు ఆరోగ్యసేవాశాఖ విస్తృతం చేయబడి పునర్వ్యవస్థీకరించబడింది.

## ౧౦. కేంద్ర ఆరోగ్య పరిశోధనాలయాలు

ఈ పరిశోధనాలయాలలో రాష్ట్ర అవసరములకు సరిపోవునంత కలరా, మశూచిక టీకాల మందులు తయారు చేయబడుతున్నవి. అంతేగాక ఈ పరిశోధనాలయాలలో త్రాగునీరు, పాలు, ఆహారము

మున్నగు వాటిని సూక్ష్మజీవులు మొదలగు వాటిని రసాయనిక విశ్లేషము చేయుటకు కూడా ఏర్పాట్లుచేయబడినవి. ఆన్నిరకాల వైద్య పరిశోధనలు చేయబడుచున్నవి.

## ౧౧. కుటుంబ పథకం

౧. *కుటుంబసంక్షేమ కేంద్రం :* ౧౯౫౫ మార్చి ౧ నుంచి హైద్రాబాదు నగరంలో కుటుంబసంక్షేమ కేంద్రం ఒకటి పనిచేస్తున్నది. కుటుంబసంక్షేమాన్నికై, కుటుంబ జీవితమునకు సంబంధించిన అన్ని రంగములలోను ఈ కేంద్రం కృషిచేస్తుంది. కుటుంబములన్నీ ఆనందముగా ఉండుటకును, తద్వారా జాతి పురోగతిని సాధించుటకును కృషి చేయడమే దీని లక్ష్యమైయున్నది.

ఈ కేంద్రములో యీ క్రింద పేర్కొనబడిన కార్యక్రమములు నిర్వహించబడుతాయి.

౧. కుటుంబ పరిమితి పద్ధతులు.

౨. నిస్సంతానము, వంధ్యాత్వమునకు సంబంధించిన సమస్యలను పరిశీలించడం.

౩. వివాహమునకు సంబంధించిన సలహాలివ్వడం.

౪. వివాహానికి పూర్వం వైద్యపరీక్ష చేయడం.

౫. దాంపత్యం విషయమై సలహాలివ్వడం.

౬. డాక్టర్లు, నర్సులు, హెల్తు విజిటర్లు మొదలగు వారికి శిక్షణ ఇవ్వడం.

ఈ పథకమునకు సాలీనా రూ. ౨౮,౫౩౩ లు ఖర్చు అవుతుంది. ఈ పథకమును అమలుపరచుటకు కేంద్ర ప్రభుత్వం అనావృత్త ఖర్చు క్రింద రూ. ౧౦,౦౦౦ లు భరించింది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఆవృత్త ఖర్చును సమిష్టిగా నిర్దిష్టశాతములలో భరిస్తున్నవి.

౨. *కుటుంబపథకం యొక్క కేంద్రములు :* ౧౦ కుటుంబ పథకం యొక్క కేంద్రములు నెలకొల్పబడినవి. ఇవి కుటుంబ పథకం, తత్సంబంధ సమస్యలపై సలహాలిస్తాయి.

## ౧౨. కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయ వికాస కేంద్రములు

రాష్ట్రంలో కమ్యూనిటీ ప్రాజెక్టు పథకముల క్రింద ౬ బ్లాకులు, జాతీయ వికాసకేంద్రముల యొక్క పథకముల క్రింద ౧౨ బ్లాకులు పనిచేస్తున్నవి. ఈ పథకముల క్రింద తలపెట్టబడిన వైద్య, ఆరోగ్య కార్యకలాపాలను సక్రమంగా నిర్వహించుటకు, వైద్యశాఖ అవసరమైన చోట్లలో ఉద్యోగ సిబ్బందిని ఇతర పరికరములను సరఫరా చేస్తున్నది.

## ౧౩. కేంద్ర ఆరోగ్య సంఘం

కేంద్ర ఆరోగ్య కౌన్సిల్‌యొక్క ఎగ్జిక్యూటివ్ బోర్డులో ఉన్న ఐదుగురు సభ్యులలో హైదరాబాదు రాష్ట్రం ఒక సభ్యత్వంగల రాష్ట్రంగా ఎన్నుకోబడింది.

## ౧౪. పంచవర్ష అభివృద్ధి ప్రణాళిక

పంచవర్ష అభివృద్ధి ప్రణాళిక క్రింద ప్రభుత్వంవారు వైద్యశాఖకు ౧౯౫౫-౫౬ సం. లో రూ. ౪,౦౮,౦౦౦ లు మంజూరు చేశారు. ఈ మొత్తం ఈ క్రింద పేర్కొనబడిన పథకములను అమలు పరచుటకు కేటాయించబడింది.

౧. రూ. ౨.౫ లక్షల ఖర్చుతో పటన్‌చెరువులోవున్న నమూనా వైద్య, ఆరోగ్య యూనిట్ల పద్ధతి ప్రకారం జిల్లాలో ౧౬ వైద్య ఆరోగ్య యూనిట్లను నెలకొల్పడం, ప్రతియూనిటుకు వైద్య, సర్జికల్, ప్రసూతి, అంబులెన్సులు, ప్రజారోగ్య సర్వీసులకు అవసరమైన పరికరములు, ఉద్యోగసిబ్బంది ఏర్పాటుచేయబడుతాయి. ఈ యూనిట్ ౬ లేక ౮ మైళ్ళ వ్యాసార్థంలో ౪౦౦౦౦ జనాభాగల ౩౦ నుంచి ౪౦ గ్రామాలకు వైద్యసహాయం చేస్తుంది.

౨. నిలోఫర్ ఆసుపత్రిలో అదనంగా ౫౦ మంచములను ఏర్పాటుచేయడం.

౩. సంగారెడ్డి గద్వాలలలో రెండు శిశుసంక్షేమ కేంద్రములను నెలకొల్పడం.

## దేశీమందులు

దేశీమందులకొరకు బడ్జెటు ౧౯౫౦ లో రూ. ౧౪,౬౨,౨౫౦ ల నుంచి ౧౯౫౫ లో రూ. ౧౬,౭౧,౩౯౬ ల పెంచబడింది. అంటే బడ్జెటులో ౧౯౫౦ సం. కన్నా ౧౯౫౫ సం.లో రూ. ౨,౦౯,౧౪౬ ఎక్కువగా కేటాయించబడినవన్నమాట.

## ఆయుర్వేద వైద్యము

౧. ఈకాలంలో ఒక ఆయుర్వేద ఆసుపత్రి, ౫౬ ఆయుర్వేద ఆసుపత్రులు తెరువబడినవి. ప్రస్తుతం మొత్తం ఒక పెద్ద ఆయుర్వేద ఆసుపత్రి, ౫౦ చిన్న ఆయుర్వేద ఆసుపత్రులు వున్నాయి. ఈ సంవత్సరంలోపల వివిధజిల్లాలలో మరి ౨౦ చిన్న ఆయుర్వేద ఆసుపత్రులను తెరుచుటకు తలపెట్టబడింది.

౧౯౫౦ సం.లో ౮ ఆయుర్వేద దవాఖానాలకు మాత్రమే గ్రాంట్లు ఇవ్వబడగా ఈ సంవత్సరం ౫౩ దవాఖానాలకు గ్రాంట్లు ఇవ్వబడుచున్నవి. ౧౯౫౦ సం. లో ఆయుర్వేదకళాశాల స్థాపించబడింది. ఇది ఇప్పుడు పునర్వ్యవస్థీకరించబడింది. ఈ కళాశాల పాఠ్య ప్రణాళికలో ఆధునిక వైజ్ఞానిక విషయములైన పెథాలజీ, అనాటమీ, ఫిజియాలజీ కోర్సులు చేర్చబడినవి.

## యునానీ వైద్యం

౧. ప్రస్తుతం ౧ యునానీ దవాఖానా ౯౮ డిస్పెన్సరీలున్నవి. యునానీ కళాశాల పునర్వ్యవస్థీకరించబడింది. దీని పాఠ్య ప్రణాళి

(తరువాయి ౩౬ వ పుటలో)

# మీర్ ఆలంబాగ్ "అతిథిగృహం"

## పిక్నిక్ పార్టీలకు, వనభోజనాలకు అనువైన స్థలం

మీర్ ఆలం చెరువువద్ద ఉన్న సాలార్జంగ్ ఎస్టేట్ 'అతిథి గృహం' హైద్రాబాదు నగరానికి మూడుమైళ్ళ దూరంలో ఉన్నది. ఈ చెరువు ౧౮౦౬ లో ప్రఖ్యాత వ్యక్తియైన మీర్ ఆలం పర్యవేక్షణ క్రింద నిర్మింపబడింది. 'అతిథిగృహం' సర్వ సౌకర్యాలతో రమణీయంగా అలంకరించ బడింది. ఇందులో ఎలక్ట్రిక్ దీపాలు, ఆధునికమైన నీరు, గాలి మొదలగు సౌకర్యాలు ఉన్నవి. ఒక వంటమనిషి, మరొక నౌకరు ఇక్కడ ఎల్లప్పుడూ ఉంటారు. పింగాణీపాత్ర సామగ్రి, చాకులు మొదలైన ఇనుపసామగ్రి కూడా ఉన్నవి. అతిథి గృహం వెనుకవున్న తోటలో నీటిని పైకెగజిమ్మె ఫౌంటెనులు, ఇంకా అందమైన దృశ్యాలెన్నో కన్పిస్తాయి. ఒకవైపున జపాన్ పద్ధతి ప్రకారం ఒక చిన్న ఉద్యానవనం కూడా వేయబడింది. ఇంజనీరింగు రీత్యా మీర్ ఆలం చెరువు కట్ట ప్రత్యేకంగా చెప్పుకోదగినది. ఇన్ని సౌకర్యాలతో ఈ అతిథిగృహం రోజుకు కల్దారు రూ. ౧౦ ల కిరాయాకు లభిస్తుంది. అయితే ఎలక్ట్రిక్ దీపాలకు ఒకరాత్రికి రూ ౧ చార్జీ వసూలుచేయబడుతుంది. విశ్రాంతికీ, వనభోజనాలకూ ఇది చాలా అనువుగా ఉంటుంది. ఈ అతిథి గృహాన్ని రిజర్వు చేయించుకోదలచిన వారు కార్యదర్శి, సాలార్జంగ్ ఎస్టేట్ కమిటీ- ఫోన్ నెం. ౪౦౬౪ తో సంప్రదించవలెను.



మీర్ ఆలంబాగ్ "అతిథిగృహం" వెనుకవున్న చక్కని ఉద్యానవనం.



మీర్ ఆలంబాగ్ "అతిథిగృహం"

(౨౩ వ పుట తరువాయి)

వీటిలో వంట చేసుకొనుటకు వలసిన వంట పాత్రలన్నీ లభిస్తాయి. ఇవేగాక. పి. డబ్ల్యు. డి. యొక్క ఆటవీ విశ్రాంతి గృహములు. లోకల్ బోర్డు వారి బంగళాలు కూడా చాలా ఉన్నాయి. ఇవన్నీ అడవులకు సమీపంలోనే ఉన్నాయి. ఇక్కడికి ప్రకృతి సౌందర్యమును చూచుటకు వచ్చువారికీ, వేటాడుటకు వచ్చువారికీ, స్థానిక అటవీశాఖ సిబ్బందివారు ఎల్లప్పుడు కావలసిన సహాయం చేస్తారు. ఈ ప్రాంతాలకు ఒకసారి వచ్చినట్లయితే మరపురాని దృశ్యములు చూచుటకు అవకాశముంటుంది. కెమెరాతో, ముఖ్యంగా మూవీ కెమెరాతో ఇక్కడ సంవత్సరం పొడుగునా మంచి ఫొటోలు తీసుకోవచ్చును.

వన్యమృగములను తుపాకితో వేటాడుటకు ప్రతి సంవత్సరం మార్చి ౧ నుంచి మే ఆఖరువరకు సులభమైన షరతులపై అనుమతి ఇవ్వబడుతుంది. అయితే డిపాజిటు క్రింద రూ. ౨౧-౭-౦ లు, లైసెన్సు ఫీజుగా రూ. ౨౧-౭-౦ లు చెల్లించవలసి ఉంటుంది; పెద్దపులిని వేటాడుటకుగాను, చంపిన ప్రతి పెద్దపులికి ప్రత్యేకంగా రూ. ౮౯-౦ చెల్లించవలెను. లైసెన్సు తిరిగి ఇచ్చివేసిన తరువాత డిపాజిట్టు డబ్బు వాపసు చేయబడుతుంది.

అడవులలోపల పక్షులను వేటాడుటకు అనుమతి ఇవ్వబడదు. అయితే ఈ పక్షులను శీతకాలంలో అడవులకు దూరంగా బైటి ప్రాంతాలలో వేటాడవచ్చును.

చేపలను సంవత్సరం పొడుగునా ముఖ్యంగా వర్షాకాలంలో పట్టుకోవచ్చును.



# హిమాయత్ సాగర్ "ఆటవీ విశ్రాంతి మందిరం"



హిమాయత్ సాగర్ ఆటవీ విశ్రాంతి మందిరం హిమాయత్ సాగర్ వ్యవసాయక్షేత్రం ప్రక్కన ఏసీ నది ఒడ్డున ఉన్నది. ఈ మందిరం ప్రకృతి రామణీయకమైన చక్కని పరిసరాలతో చూడడానికి ఎంతో నేత్రపర్వంగా ఉంటుంది. సెలవుదినములలో కాలక్షేపాని కిది ఎంతైనా తగివున్నది. దీనికి ౭.౫ ఎకరాల విశాలమైన మైదానం, తోటలు. చక్కని చెట్లవరుసలు, వేసవి కుటీరం, నీరు పైకి ఎగజిమ్మే ఫౌంటెయిన్లు ఉన్నవి. ఈ మందిరంలో రెండు పడకగదులు, స్నానాలగదులు, ఒక భోజనశాల, ఒక వంటగది ఇంకా ఆధునికమైన కొయ్యసామగ్రి, ఫర్నీచర్, తివాచీలు, పింగాణీ పాత్రసామగ్రి, చాకులు మొదలగు ఇనుప వస్తువులు, శీతల పాత్ర సామగ్రి ఉన్నవి.

ఈ మందిరం రేట్లు క్రింది విధంగా ఉన్నవి :

ఒక పడకగది నివాసమునకు లైట్లతో సహా ౨౪ గంటల కిరాయా రూ. ౩-౦-౦ లు.

ఒక పడకగది నివాసమునకు లైట్లు లేకుండా ౨౪ గం.ల కిరాయా రూ. ౨-౦-౦ లు.





హిమాయత్ సాగర్
ఆటవీ కేంద్రంలో
చెట్ల వరుస.





హిమాయత్‌సాగర్ ఆటవీ విశ్రాంతి మందిరం.



అతివృష్టి కారణంగా ఈసానదికి వరదవచ్చింది.

# వార్తలు

## బర్మానుంచి నిపుణుల రాక

ఫోర్డు ఫౌండేషన్‌వారి సహాయంతో ఏర్పాటు చేయబడిన వ్యవసాయ విద్యా కార్యక్రమంలో ఒక భాగంగా బర్మానుంచి కొందరు నిపుణులు నవంబరు ౧౫ తేదీన హైదరాబాదు విచ్చేశారు. వారు రాజేంద్ర నగరులోని వ్యవసాయ పరిశోధన కేంద్రాన్ని, గ్రామీణ కార్యకర్తల శిక్షణ కేంద్రాన్ని, సాంఘిక విద్యావ్యవహర్తల శిక్షణ కేంద్రాన్ని, అభివృద్ధి కార్యక్రమాధికారుల శిక్షణ కేంద్రాన్ని, వ్యవసాయ కళాశాలను, జాతీయవికాస కేంద్రమైన నాచారం గ్రామాన్ని దర్శించారు.

బర్మానుంచి వచ్చిన నిపుణులలో పైన్మానాలోని వ్యవసాయ ఇన్‌స్టిట్యూట్ ప్రిన్సిపాల్ యుథీన్‌మాంగ్, అసిస్టెంట్ లెక్చరర్ యు టిన్‌మాంగ్‌ల్వియు, శిక్షణపొందుతున్న విద్యార్థి మిస్టర్ డబ్ల్యు. కె. గాంబ్లే గారలు వున్నారు. వీరంతా రాష్ట్రంలో జరుగుతున్న వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలను పరిశీలించి తమ ప్రశంసలు తెలియజేశారు.

## వడ్ల ధరల స్థిరీకరణ పథకం

భారత ప్రభుత్వం తలపెట్టిన వడ్లధరల స్థిరీకరణ పథకాన్ని అనుసరించి హైద్రాబాదు రాష్ట్ర ప్రభుత్వం మోటా నెం. ౧ దొడ్డురకం వడ్లను ఈ దిగువ కేంద్రాలలో కొనడానికి నిర్ణయించింది.

౧. మంచిర్యాల, ౨. పెద్దపల్లి, ౩. భోనగిరి, ౪. జనగామ, ౫. వరంగలు, ౬. ఖమ్మం, ౭. కొత్తగూడెం, ౮. నిజామాబాదు, ౯. కామారెడ్డి, ౧౦. శంకరపల్లి, ౧౧. మహబూబునగర్, ౧౨. బాదేపల్లి, ౧౩. షాద్‌నగర్, ౧౪. వనపర్తి, ౧౫. తాండూరు, ౧౬. మహబూబాబాదు, ౧౭. జమ్మికుంట, ౧౮. గజ్వేల్, ౧౯. బోధన్,

ఒక్కొక్క కేంద్రంలో ఎంత పరిమాణం వడ్లు ఏ ధరకు కొనబడుతాయో ఆ తరువాత ప్రకటింపబడుతుంది. వడ్ల ధరలు పడిపోకుండా, రైతులు తాము పండించిన పంటకు తగు ధరను పొందునట్లు చేయడానికై ఈ పథకం తలపెట్టబడింది. కనుక రానున్న వరికోతల తరువాత రైతులు పై కేంద్రాలలో వడ్లు అమ్మి ఈ పథకంవల్ల లాభం పొందవచ్చును.

## గుల్బర్గా కమ్యూనిటీ ప్రాజెక్టు
## శ్రీ యస్. కె. డే. ప్రశంస

"దేశంలోని కొన్ని కమ్యూనిటీ ప్రాజెక్టు బ్లాకులను సందర్శించవలసిందిగా నేను మన ప్రధానమంత్రి శ్రీ జవాహర్ లాలు నెహ్రూను కోరుతూవున్నాను. అయితే ప్రత్యేకంగా ఏ బ్లాకును చూడవలసిందిగా కోరాలో నేనింతవరకు నిర్ణయం చేయలేకపోయాను. కాని ఇప్పుడు నిర్ణయం చేశాను" అంటూ కమ్యూనిటీ ప్రాజెక్టుల అడ్మినిస్ట్రేటర్ శ్రీ యస్. కే. డే. నవంబరు నెల మొదటి వారంలో గుల్బర్గాజిల్లాలోని కమ్యూనిటీ ప్రాజెక్టు పర్యటన సందర్భంలో వస్థాబాదు గ్రామంలో జరిగిన బహిరంగ సభలో ప్రసంగించారు. శ్రీ డే రెండురోజులపాటు ఈ జిల్లాలో పర్యటించారు.

శ్రీ యస్. కే. డే తమ పర్యటనలో ౧౪ గ్రామాలకు వెళ్ళి రెండు సామాజిక కేంద్రాలకు, మూడు ప్రసూతి కేంద్రాలకు, ఒక ప్రాథమిక పాఠశాలభవనానికి, రెండు గ్రామీణగృహ నిర్మాణ స్కీములకు, మూడు గ్రామరోడ్లకు, గ్రామీణకార్యకర్తల నివాసగృహాలు మూడింటికి, ఒక పశువైద్య కేంద్రానికి, ఒక కోళ్ళ పెంపక కేంద్రానికి ప్రారంభోత్సవాలు చేశారు.

శ్రీ దే ఈ పర్యటనలో అనేకచోట్ల ఉపన్యసిస్తూ కమ్యూనిటీ ప్రాజెక్టు అభివృద్ధి కార్యక్రమంలో కొన్ని అంశాలలో హైదరాబాదు రాష్ట్రం అగ్రగామిగా వున్నదనీ, గుల్బర్గా కమ్యూనిటీప్రాజెక్టు బ్లాకు తాము రాష్ట్రంలో ఇంతవరకు చూచిన వాటిలో ఉత్తమమైనవనీ, ఈ బ్లాకు ౧౫ నెలల క్రితం మాత్రమే ప్రారంభింపబడినప్పటికీ దీనిలో చక్కని కృషిజరిగిందనీ, ముఖ్యంగా సందర్శకారు ఆదర్శ క్షేత్రాన్ని చూచి తామెంతో ఆనందించామనీ, వ్యవసాయ కార్యక్రమం విషయంలో గుల్బర్గా బ్లాకు ఇతర బ్లాకులకు మార్గదర్శకంగా వున్నదనీ అన్నారు.

సుల్తాన్‌పూరు గ్రామాన్ని ముఖ్యంగా పోలీసులే అభివృద్ధి పరిచారు. శ్రీ యస్. కే. దే ఈ గ్రామాన్నిచూచిన తరువాత శాంతి భద్రతల రక్షణకై నియమింపబడిన ఉద్యోగులు అవనినేగాక సాంఘిక సేవ, జాతీయనిర్మాణ కార్యకలాపాలను కూడా విజయవంతంగా జరుపగలరని హైదరాబాదు పోలీసులు ఇతర రాష్ట్రాలవారికి చేసి చూపించారనిఅన్నారు.

పర్యటన ముగిసిన తరువాత శ్రీ యస్. కే. దే అధికారులను, అనధికారులను అభినందించి, కొద్దికాలంలోనే గుల్బర్గా భారత దేశంలోనే ప్రముఖమైన ప్రాకెక్టు బ్లాకుగా తయారైనదని అన్నారు.

(౩౦ వ పుట తరువాయి)

ంలో ఆయుర్వేద కళాశాలలో చేర్చబడిన కోర్సులు కూడా ప్రవేశ పెట్టబడినవి. రెండు యునానీ డిస్పెన్సరీలకు గ్రాంటు ఇవ్వబడుతున్నది.

## ౨. ఇతర వైద్యములు

హోమియోపతి, ప్రకృతి వైద్య ఆసుపత్రులు కూడా ప్రోత్సహించబడుతున్నవి. ౪ హోమియోపతి ఆసుపత్రులకు ఒక ప్రకృతి వైద్య చికిత్సాలయానికి గ్రాంటు ఇవ్వబడుతున్నది.



*మహిళా కళాశాల విద్యార్థినులతో, ఉపాధ్యాయినులబృందంతో రాష్ట్ర డిప్యూటీ ప్రధానమంత్రి.*

# రాష్ట్ర చేనేతపరిశ్రమ అభివృద్ధి

*చేనేత పరిశ్రమ హైద్రాబాదు రాష్ట్రంలో నూటికి ౮౦ వంతుల జనాభాకు జీవనాధారంగా ఉన్నది. ఈ పరిశ్రమ ప్రభుత్వ సహాయంతో దినదినాభివృద్ధి గాంచుతున్నది. ముడి సరుకులను సేకరించి పంపిణీ చేయడానికీ, విక్రయశాలలు, అద్దకపుశాలలు నెలకొల్పడానికీ, జాలు మగ్గములను కుప్పుమగ్గములుగా మార్చడానికీ, ఇంకా యంత్రసంబంధమైన అభివృద్ధిని సాధించడానికీ అప్పులు, గ్రాంట్లు ఇవ్వబడుతున్నవి. ఇటువంటి సహాయమే ఉన్ని సిల్కుపరిశ్రమలకు కూడా చేయబడుతున్నది. ఫలితంగా ఈ మూడుసరకముల చేనేత పరిశ్రమ ఉత్పత్తి ప్రమాణంలోను, నాణ్యంలోను చాలా అభివృద్ధి చెందింది.*

రాష్ట్రంలోని భారీ పరిశ్రమలలో చేనేత పరిశ్రమ ఒకటి. చేనేత పనివారలు రాష్ట్రమంతటా ఉన్నారు. అయితే కరీంనగర్, నల్లగొండ, వరంగలు, మహబూబునగర్, మెదక్, గుల్బర్గా జిల్లాలలో ఎక్కువ మగ్గములున్నవి. రాష్ట్రంలోని మగ్గాలలో నూటికి ౭౫ వంతులు ఈ జిల్లాలలోనే ఉన్నవి. ఇచటి చేనేత పనివారు ఎక్కువగా ౧౬ మరియు ౨౬ నెంబర్ల నూలు వాడుతారు. అయితే ౨౦ నెంబరునుంచి ౮౦ మరియు ౧౦౦ నెంబర్ల నూలుకూడా వాడడం కలదు.

చేనేత పనివారు ఎక్కువగా మహాజన్‌లక్రిందనే పని చేస్తూ పనికీ, జీవనభృతికీ వారిమీదనే ఆధారపడివుంటూ ఉండేవారు. మహాజన్‌లు చేనేతపనివారికి నూలు సరఫరా చేసేవారు. వీరు వస్త్రమును నేసి, తీసుకువెళ్ళి వారికిచ్చి అందుకు ప్రతిఫలంగా కొంతవేతనం పొందుతూవుండేవారు. ఈవిధంగా చేనేత పనివారు వేతనాలు సంపాదించుకొనే పొట్టపోసుకుంటూ ఉండేవారు. అయితే వస్త్రముల కంట్రోలు ప్రవేశపెట్టబడడంతో నూలు సరఫరా చిల్లర డిపోలద్వారా జరగడం మొదలయింది. ఆ డిపోలో చేనేతపనివారందరూ తమ పేర్లను రిజిస్టరు చేయించుకునేవారు. దీనివల్ల వారు డిపోనుంచి నూలుపొంది ఆ తరువాత మహాజన్‌లకు తమ షరతులను చెప్పగలిగిన స్థితికి వచ్చారు. అయితే నూలు పంపిణీపై కంట్రోలు రద్దు అయినతర్వాత చిల్లర నూలుడిపోలన్నీ చేనేత పనివారల సహకార సంఘాలుగా మార్చబడినవి. ఇవన్నీ ఒక కేంద్రసంస్థకు అనుబంధ సంస్థలుగా ఉంటున్నవి. చేనేతపనివారలకు ఒక కేంద్రసంస్థగా వ్యవహరించడానికై ౧౯౫౦ లో హైద్రాబాదు చేనేతపనివారల కేంద్ర సహకార సంఘం ఏర్పాటుచేయబడింది. ప్రస్తుతం ఈ కేంద్రసంస్థక్రింద ౧౪౪ సహకార సంఘాలున్నవి. వీటిలో ౧,౩౫,౦౦౦ చేనేత పనివారు సభ్యులుగా ఉన్నారు.

## సంఘాలకు అప్పులు

భారతప్రభుత్వం మంజూరుచేసిన గ్రాంట్లు, మరియు అప్పులరూపంలో రాష్ట్రప్రభుత్వం చేనేత పరిశ్రమకు సహాయపడుతూవున్నది. సహకార సంఘాలు ముడిసరుకులను సేకరించి వాటిని చేనేత పనివారికి వస్త్రోత్పత్తికొరకు సరఫరా చేసేటందుకై ఆర్థికసహాయం చేయబడుతున్నది. ౧౯౫౨ నుంచి ౧౯౫౪ వరకు మగ్గాలకు ఉత్పత్తిపని కల్పించడానికై ఒక్కొక్క సహకార సంఘముయొక్క మొత్తం మగ్గాలకుగాను నూటికి ౨౦ వంతులచొప్పున ప్రభుత్వం చేనేత సహకార సంఘాలకు అప్పులిచ్చింది. ఈ అప్పులను కేంద్ర చేనేతసెస్సునిధినుంచి వడ్డీలేకుండా భారతప్రభుత్వం ఇస్తుంది. మళ్లీ ఈ అప్పులు ఆయా సంఘాలనుంచి ౫ సాలుసరి సమాన కిస్తులలో రాబట్టుకోబడుతాయి. అయితే అలా రాబట్టుకోవడం అప్పు ఇచ్చిన రెండేళ్ల తరువాతనుంచి మొదలవుతుంది. ఈ విధంగా వస్త్రోత్పత్తి పెరిగింది.

౧౯౫౨-౫౩ లో ౨౮ లక్షల గజాల వస్త్రం ఉత్పత్తి అయింది. ౧౯౫౩-౫౪ లో ౫౫ లక్షలగజాల వస్త్రం ఉత్పత్తిఅయింది. ౧౯౫౪-౫౫ లో వస్త్రోత్పత్తి ౧౧౬ లక్షల గజాలవరకు పెరిగింది.

అయితే ఉత్పత్తి పెరిగినకొలది అమ్మకపుబాధ్యతకూడా హెచ్చుతుంది. అందుచేత తయారైన వస్త్రాన్ని వెంటనే అమ్మడానికై ప్రతి సహకార సంఘం తన అధీనంక్రింద వున్న ప్రాంతంలో సొంతంగా ఒక విక్రయశాలను ఏర్పాటు చేసుకొన్నది. ఈ విక్రయశాల లన్నిటికీ ప్రభుత్వం ఒకే విధమైన ఇనుప అల్మారాలను, ఇనుప ర్యాకులను, బల్లలను, ప్రదర్శనపెట్టెలను సరఫరా చేసింది. ఇట్లా ఒక్కొక్క సంఘానికి రూ. ౧౫౦౦ ల విలువగల సామగ్రి సరఫరా చేయబడింది. ఇవేగాక ప్రతి సహకార సంఘానికి నిర్వహణ ఖర్చులకుగాను నెలకు నూరు రూపాయలచొప్పున ఒక ఏడాదిపాటు ఇవ్వడానికి ఒక ప్రతిపాదన కలదు. మంజూరీ రాగానే ఈ స్కీము అమలుపరచబడుతుంది. మిల్లులు చేనేత పరిశ్రమకు పెద్ద పోటీగా ఉన్నవిగనుక చేనేత వస్త్రం అమ్మకంపై ప్రభుత్వం రిబేటు ఇస్తున్నది. రూ. ౨ లు లేక అంతకు మించిన చిల్లర అమ్మకంపై కొనేవారికి ౧½ అణాల రిబేటు ఇవ్వబడుతుంది. తిరిగి ఈ లోటు ప్రభుత్వ చేనేత సెస్సునిధి నుంచి భర్తీచేయబడుతుంది. విక్రయశాలలు అందజేసే రిబేటు క్లెయిములను జిల్లా చేనేత ఇన్‌స్పెక్టర్లు, పరిశ్రమల సూపరింటెండెంట్లు తనిఖీచేసి అవి క్రమంగావున్నవో లేవో చూస్తారు.

౧౯౫౪-౫౫ లో ౧౧౬ విక్రయశాలలకు ఫర్నీచరు సరఫరా చేయబడింది. ౧౯౫౫-౫౬ సంవత్సరంలో మరి ౬౦ విక్రయశాలలకు ఇనుప ఫర్నీచరు సరఫరా చేయవలెనని తలపెట్టబడింది.

## రంగుల అద్దకపుశాలలు

మంచి అందమైన రంగు రంగుల నాణెమైన వస్త్రమే కావాలని వినియోగదారులు విక్రయదారులు కోరుతూవుంటారు. కనుక ఇందుకనుగుణంగా ఉత్పత్తి జరగడానికై చేనేత సహకార సంఘాల ప్రక్కనే రంగుల అద్దకపుశాలలు స్థాపించవలెననే ప్రతిపాదన ఒకటి ఇప్పుడు ఆలోచనలో ఉన్నది. నాణ్యమైన తీరుతీరుల చేనేత వస్త్రం లభించడం లేదన్న కారణంతో ఈ పరిశ్రమ మూలబడిపోకుండా చేయడానికై ౧౯౫౫-౫౬ లో ౩౦ అద్దకపుశాలలు మంజూరు చేయబడినవి. ఇందుకొరకు కేటాయించబడిన డబ్బు ఎక్కువ మగ్గాలున్న సహకారసంఘాలకు ఇవ్వడమైనది. ఈ డబ్బుతో ఆ సంఘాలు వివిధరంగుల బట్టలను తయారుచేసుకోవచ్చు. అద్దకపుశాల మంజూరైన ప్రతిసంఘానికి రూ. ౨,౦౦౦ లు అప్పు ఇవ్వబడినది. ఈ డబ్బుతో ఆ సంఘం రంగులు, ఇతర ముడిసరుకు కొనుక్కోవచ్చు. ఇంతేగాక ప్రతి అద్దకపుశాలకు ఒక సంవత్సరం వరకు సరిపొయ్యే నిర్వహణ ఖర్చుకొరకై గ్రాంటుగా రూ. ౪,౫౬౦ లు ఇవ్వబడింది. ౧౯౫౫-౫౬ సంవత్సరానికి భారత ప్రభుత్వం అదనంగా మరి ౧౫ అద్దకపుశాలల స్థాపనకు మంజూరీ ఇచ్చింది. ఈ శాలలు మగ్గములెక్కువగావున్న ప్రాంతాలలో నెలకొల్పబడుతాయి. అయితే కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలలో వున్నట్టి సహకార సంఘాలకు అద్దకపు శాలల స్థాపనవిషయంలో ప్రాధాన్యమివ్వబడుతుంది.

త్వరితగతిని, సమర్థవంతంగా వస్త్రోత్పత్తి జరుగడానికై మేలురకం పద్ధతులకు సంబంధించిన మగ్గములుకూడా ప్రవేశపెట్టబడినవి.

రాష్ట్రంలో దాదాపు ౧౫౦౦౦ పాతరకపు జాలుమగ్గములు (సత్తర్‌మగ్గములు) ఉన్నవని అంచనా వేయబడింది. వీటిని కుచ్చుమగ్గములుగా మార్చవలెనని ప్రతిపాదించబడింది. ఈమార్పిడిపని ౩ లేక ౪ ఏండ్లలో జరుపబడుంది. మొదట ౧౯౫౪-౫౫ లో ౫౦౦౦ జాలుమగ్గాలను కుచ్చుమగ్గాలుగా మార్చడానికై చేనేతపనివారల సహకార సంఘాలకు గ్రాంట్లు ఇవ్వబడినవి. ఈ సంవత్సరం ఇంకా ౨౫౦౦ మగ్గాలు కుచ్చుమగ్గాలుగా మార్చబడుతున్నవి. అంచులు, నాడెములు తయారుచేయడానికి ఒక్కొక్కదానికి రూ. ౨౫ లు అవుతుంది. ఇవి ఆయా సహకార సంఘాలద్వారా చేనేత పనివారలకు సరఫరా చేయబడినవి. జాలుమగ్గంకంటె కుచ్చుమగ్గం మిగుల ప్రయోజనకరమైనది. ఎందువల్లనంటే కుచ్చుమగ్గంవల్ల నేత త్వరితగతిని జరిగి, ఒక్క మగ్గంపైననే ఎక్కువ ఉత్పత్తి జరుగుతుంది.

చేనేతపనివారల గుంటమగ్గాలకు ౩౪౦౦ ఉేకప్ మోషన్ అటాచ్ మెంట్స్ సరఫరాచేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నవి. ఇందువల్లకూడా త్వరితగతిని ఉత్పత్తి జరుగుతుంది.

ప్రయోగరీత్యా ౫౦ పెడల్‌మగ్గాలను సరఫరాచేయడానికి కూడా ఏర్పాట్లు జరుతున్నవి. గుంటమగ్గాలకంటె పెడల్ మగ్గాలు అధికప్రయోజనం గలవి. ఒక్కొక్క పెడల్ రూ. ౫౦౦ లు ఖరీదు చేస్తుంది.

చేనేతసంఘాలు ఫ్యాన్సీవస్త్రాలు తయారుచేయు వీలు కలిగించడానికై మేలురకం పరికరములు సరఫరా చేయబడుతున్నవి. మగ్గములకు జాకార్డ్సు, దాబీలు తగిలించి ఫ్యాన్సీ వస్త్రములను నేయవచ్చును. ఇవి ఒక్కొక్కటి ౨౫ సెట్లు చొప్పున ఈ సంవత్సరం ఫ్యాన్సీవస్త్రములను నేసే సంఘాలకు సరఫరా చేయబడుతాయి.

## పోటీలు

చేనేత పరిశ్రమాభివృద్ధికి పెట్టుకున్న లక్ష్యాలలో ఒక ముఖ్యమైన లక్ష్యం ఏమిటంటే మేలురకం డిజైనులు, నమూనాలు ప్రవేశపెట్టి చేనేతవస్త్రాలను ప్రజలకు ఆకర్షవంతంగా తయారుచేయడం. ఈ లక్ష్యాన్ని సాధించడానికై పోటీలు నిర్వహింపబడి, ఆ పోటీలలో గెలిచినవారికి బహుమతు లివ్వబడుతున్నవి.

రాష్ట్రంలో ఉత్పత్తి అయిన చేనేతవస్త్రాన్ని విక్రయించే కార్యకలాపాలను చేనేత పనివారల కేంద్రసంఘమే సమన్వయపరచాలని భావింపబడింది. కాబట్టి ౧౯౫౪-౫౫ లో కేంద్ర చేనేత సంఘానికి ఈ క్రింది ఆరుచోట్ల ఒక్కొక్కటి చొప్పున మార్కెటింగు డిపోలు నెలకొల్పడానికై ఆర్థిక సహాయం చేయబడింది.

౧. నారాయణపేట ౨. గుల్బర్గా
౩. నల్లగొండ ౪. వరంగలు
౫. నాందేడు ౬. కరీంనగర్

ఈ ఆరింటిలో అప్పుడే నాలుగు డిపోలు తెరువబడి సంతృప్తికరంగా పనిచేస్తున్నవి. ఇక నాందేడు, నల్లగొండలలో త్వరలో ఈ డిపోలు తెరువబడగలవు.

రాష్ట్రంలో తయారయ్యే చేనేతవస్త్రాలకు ఇతర రాష్ట్రాలలోను, విదేశాలలోను మార్కెటు కలిగించడానికై కొత్త ఢిల్లీలోను, బొంబాయిలోను విక్రయశాలలు తెరువబడుతున్నవి. ఈ విక్రయశాలలు హైద్రాబాదు చేనేతపనివారల కేంద్ర సహకారసంఘం లిమిటెడ్ సంస్థయొక్క ఏజన్సీ ద్వారా నడుపబడుతాయి. ఢిల్లీలోని విక్రయశాలపద్ధతిపై ఔరంగాబాదులో మరొక విక్రయశాల తెరుపబడుతున్నది. ఔరంగాబాదు ప్రముఖ యాత్రాకేంద్రం కావడంచేత అక్కడి విక్రయశాలలో మంచి వ్యాపారం జరిగి విదేశాలనుంచికూడా చేనేతసరుకుకు ఆర్డర్లు రాగలవని ఆశించబడుతున్నది.

పన్నెకట్టడం, కాలెండరింగు మున్నగుపద్ధతులవల్ల చేనేత వస్త్రమునకు ఆకర్షణ రావడమేగాక నేతలో వచ్చేటటువంటి లోపాలను దోసగులనుకూడా సరిచేయడానికి వీలుకలుగుతుంది. చక్కగా పన్నెకట్టిన వస్త్రములకు మంచి గిరాకీ ఉంటుంది. అంతేగాక అవి మిల్లువస్త్రముల పోటీని తట్టుకోగలవు. కేంద్రస్థలమైన హైద్రాబాదునగరంలో ప్రత్యేకంగా ఒక కర్మాగారం స్థాపించబడుతున్నది. యంత్రస్థాపనకు ప్లానులు తయారుచేయడం, యంత్రముల కొనుగోలుకు ఏర్పాట్లుచేయడం- ఈ పని అంతా పూర్తి అయింది. ఈ ఆర్థిక సంవత్సరాంతంలోపుగా ఈ కర్మాగారం పనిచేయడ మారంభించగలదని ఆశింపబడుతున్నది.

## ఉన్ని, సిల్కు పరిశ్రమలు

ఈ రాష్ట్రంలో నూలువస్త్రముల పరిశ్రమవలెనే ఉన్ని, సిల్కు పరిశ్రమలుకూడా తగు ప్రాముఖ్యం వహించివున్నవి.

ఈ రాష్ట్రంలో ఉన్ని నేత పరిశ్రమ పెద్దదే. దాదాపు ౧౫,౦౦౦ ఉన్నిమగ్గాలు ఇక్కడ ఉన్నాయి. అయితే ఈ నేతపనివారు పేదవారు కావడంచేత కదురులతో ఉన్ని దారం తీస్తారు. కనుక ఉత్పత్తి చాలా మందంగా వుంది. కనుక ఉన్ని నేత పనివారల ఆర్థిక దుస్థితిని గమనించి వారిని కూడా సహకార రంగంలోకి తేవాలని తలపెట్టబడింది. ప్రస్తుతమున్న సహకార సంఘాలలో గాని లేదా కొత్త సంఘాలలోగాని చేరే నేతపనివారికి పెట్టుబడిసొమ్ము క్రింద ఒక్కొక్కరికి రూ. ౧౦ ల చొప్పున అప్పు ఇవ్వబడుతుంది. దీనిపై వడ్డీలేదు. ఇంతేగాక నిర్వహణ ఖర్చులకుగాను ఈ సహకార సంఘాలకు మగ్గానికి రూ. ౧౦౦ ల చొప్పున అప్పు ఇవ్వబడుతుంది. ఇంతవరకు ౮ ఉన్ని సంఘాలు ఏర్పడినవి. మరి నాలుగు సంఘాలు రిజిస్టరు కాబోతున్నవి. ౧౯౫౪-౫౫ లో రెండు విక్రయశాలల స్థాపనకు

మంజూరీ ఇవ్వబడింది. ఈ సంవత్సరం మరి రెండు తెరువబడుతున్నవి.

సిల్కువస్త్రముల నేతక్రింద ౫,౦౦౦ మగ్గములున్నవని అంచనా వేయబడింది. మొదట ౫౦౦ మంది నేతపనివారిని సహకార రంగంలోకి తీసుకురావాలని నిర్ణయింపబడింది. అయితే ఈ పరిశ్రమ ఫ్యాన్సీవస్త్రములకు సంబంధించి గనుక దీనిని మాలువస్త్రపరిశ్రమ అంతగా ఉద్ధరించవలసిన అగత్యంలేదు. అయినా ఈ రాష్ట్రం సిల్కుపరిశ్రమకు కొంత పేరు ప్రఖ్యాతులున్నవికాబట్టి ఆ నేశపనివారలకు పెట్టుబడికిగాను కొంత ఆర్థికసహాయం చేయవలెనని నిశ్చయింపబడింది. సిల్కునూలు ఖరీదు ఎక్కువకాబట్టి ఒక్కొక్క నేతపనివారికి రూ. ౫౦౦ లు నిర్వాహక పెట్టుబడిగా ఇవ్వవలెననీ, దీనిని ప్రభుత్వమే వారి కిచ్చి రెండుసాలుసరి కిస్తులలో తిరిగి వారినుంచి రాబట్టుకోవలెననీ నిర్ణయింపబడింది.

ఈ విధంగా నూలు, ఉన్ని, సిల్కు వస్త్రపరిశ్రమలకు ఆర్థికసహాయం చేయడంవల్ల ఇవి చాలా అభివృద్ధి చెందినవి. వచ్చే ఐదేండ్లలోపల చేనేతపరిశ్రమ స్వయంపోషకమై ఇతోధికంగా అభివృద్ధి గాంచగలవని ఆశింపబడుతున్నది.



*నాగార్జునసాగర్ కంట్రోలుబోర్డు ప్రథమ సమావేశం 29-9-1955 తేదీన హైద్రాబాదులో జరిగింది. సమావేశానికి ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించారు.*

ఎ. సి. సి. ట్రెయినింగ్ క్యాంపు : 1-10-1955 తేదీన సికింద్రాబాదు, నేపియర్ లైన్సు తార్ బండ్ లో
ఎ. సి. సి. టీచర్సు ట్రెయినింగ్ క్యాంప్ పెరేడును ముఖ్యమంత్రిగారు తనిఖీచేస్తున్నారు.



ఈజిప్టు డిప్యూటీ ప్రధానమంత్రికి ముఖ్యమంత్రిగారు
విమానాశ్రయంలో వీడ్కోలు చెబుతున్నారు.



ఈజిప్టు డిప్యూటీ ప్రధానమంత్రి, ఉస్మానియా విశ్వ
విద్యాలయ విద్యార్థుల సమావేశంలో ప్రసంగించారు.

